# మహాప్రస్థానం



శ్రీశ్రీ






విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

మహాప్రస్థానం - శ్రీరంగం శ్రీనివాసరావు


ప్రచురణ నెం 2350/2290 R

ప్రతులు 2000

తొలి ముద్రణ జూన్, 1950 (నళినీకుమార్, మచిలీపట్నం)

మలికూర్పులు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

ఫిబ్రవరి '54, జూలై '54, జనవరి '56, ఫిబ్రవరి '58, సెప్టెంబర్ '59, ఆగస్టు '61, ఏప్రిల్ '62, డిశెంబరు '63, మార్చి '65, సెప్టెంబర్ '67, జూన్ '69, ఫిబ్రవరి '70, అక్టోబరు '73, నవంబరు '75, జూన్ '81, మార్చి '84, జూన్ '87, ఆగస్టు '88, మార్చి '91, జూలై '93, నవంబరు '94, జూన్ '99 (విరసం,) అక్టోబరు, 2001, జూలై, 2003

26వ ముద్రణ జూలై, 2004




టైటిల్ డిజైన్ . మా. గోఖలే

**వెల: రూ. 40-00**


ప్రతులకు **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001
E-mail visalaandhraph@yahoo com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ

ముద్రణ· **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్**, హైదరాబాద్

# నా మాట*

లండన్ నగరంలో వెలువడుతున్న "విదేశాంధ్ర ప్రచురణల" నిమిత్తం నా "మహాప్రస్థానం" గీతాలను టేప్ రికార్డు చేసి, నా కంఠధ్వని ఉన్న Cassetes తో బాటు, నా సొంత దస్తూరీలో అన్ని గీతాలనూ facsimile రూపంలో విడుదల చేసే సందర్భంలో ముందుమాటగా ఏదైనా చెప్పమని ప్రచురణకర్త హోదాలో మిత్రుడు డా॥ జి కృష్ణమూర్తి నన్నడిగారు. అప్పుడు చలంగారి యోగ్యతాపత్రాన్నే చదివేద్దామనుకున్నాను. "మీ అభిప్రాయాలే వినిపించా"లన్నారు మిత్రులు. "సరే!" అన్నాన్నేను.

ఈ ప్రచురణలో చలంగారి రచన లేకపోవడం ఒక లోపమని నేను భావించలేదు ఎక్కడైనా దాని విశిష్టమైన విలువ దానికుండనే ఉంది అయితే అదే ముఖ్యమైనదని అనుకునేవాళ్లు కూడా ఉన్నారు. "ప్రగతి" వారపత్రికలో నేను నిర్వహించిన "ప్రజ" (ప్రశ్నలు, జవాబులు) అనే శీర్షికలో పిచ్చిరెడ్డి అనే యం.ఏ. విద్యార్థి, "యోగ్యతాపత్రం చదివితే మహాప్రస్థానం గీతాలు మరి చదువనక్కరలేదని నేనంటాను. దీనికి మీరేమంటారు?" అని ప్రశ్నించాడు అందుకు నా జవాబు, "మీరు సార్ధక నామధేయులంటాను" అని!

చలంగారి చేత పనికట్టుకొని ప్రశంసావాక్యాలు వ్రాయించినవాడు జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రి ఆ రోజుల్లో రుక్కాయి నాకు, అతని మాటల్లోనే, "అనధికార పబ్లిసిటీ ఆఫీసరు"గా పనిచేసేవాడు నా గీతాలన్నీ ఎక్కడెక్కడ అచ్చయినవీ ఒకనోటు బుక్కులో రాసుకునేవాడు. చాలామట్టుకతని కవి కంఠస్థం ఒక మారతను మాయింటికి వచ్చి, అప్పటికి అసంపూర్ణంగా ఉన్న "జగన్నాధుని రధచక్రాలు" చూశాడు. మహాప్రస్థానం గీతాలన్నిటిలోనూ ఏక బిగిని రాయనిది ఇదొక్కటే. "కవితా! ఓ కవితా!" వంటి సుదీర్ఘ గీతాన్ని కూడా ఒకే ఊపులో రాశాను."వస్తున్నాయొస్తున్నాయ్"కి పేరడీగా "వెళిపోయాయ్ వెళిపోయాయ్" అంటూ జరుక్కు "అశ్వాసాంతం" రాసి "భారతి"లో అచ్చువేయించాడు. దానితో నాకు తొందరపుట్టి "రధచక్రాలు" పూర్తిచేశాను. మరుచటి నెల "భారతి"లో అది వెలువడింది.

1940లలోనే "మహాప్రస్థానం" ప్రెస్‌కాపీ సిద్ధం చేశాను జనార్దనరావు మరణవార్త వినగానే ఈ పుస్తకం అతనికే అంకితం అనుకున్నాను. ఆరోజే (1938లో ఒకరోజు) "తలవంచుకు వెళిపోయావా! నేస్తం" అంటూ అంకిత గీతం సిద్ధం చేశాను తర్వాత 1950 నాటికి గాని ఈ గ్రంధం ముద్రణ కాలేదు. "నళినీ కుమార్" అనే మిత్రుడు చేసిన ధనసాహాయ్యంతో మొదటి ముద్రణ

---

* మహాప్రస్థానం గీతాల రచనా నేపథ్యం ప్రచురణ విశేషాలూ పాఠకులకు తెలియడం అవసరం అన్న భావంతో శ్రీశ్రీ చేతిరాత లండన్ ప్రతి (1980) లోని శ్రీశ్రీ "నా మాట"ను ఈ సంకలనంలో చేరుస్తున్నాం. – ప్రచురణకర్తలు.

వెలుగుచూసింది. అది నా నలభయ్యోయేట నా మిత్రుడిచ్చిన కానుక. జేమ్స్‌జాయిస్ Ulysses కూడా అతని నలభయ్యోయేట పారిస్‌లో అచ్చయింది

ఆ తర్వాత "మహాప్రస్థానం" ముద్రణలు విశాలాంధ్ర ప్రచురణల ద్వారా రమారమి ఇరవైసార్లు జరిగాయి అందుచేత ఇప్పుడు కొత్తగా ఈ లండన్ ముద్రణ యెందుకని నే ననుకున్నాను దీనికి శ్రీ పురిపండా వారు చెప్పిన కారణం ఇది "మహాప్రస్థానం ఈ శతాబ్దంలో తెలుగులో వచ్చిన ఏకైక మహాకావ్యం." ఆయనింకా ఇలా అన్నారు-"నాకు తెలిసినంతమట్టుకు మరే భారతీయభాషలోనూ 'కవితా! ఓ కవితా!' అంత గొప్పగీతం రాలే"దని. ఈ ప్రచురణకు మరోముఖ్యకారణం ఉంది ఇది నా సొంతదస్తూరీ. సొంతగొంతుక. కవితాప్రకాశనంలో ఏ భాషలోనూ, ఎప్పుడూ, ఎక్కడా కనీ వినీ ఎరగని కొత్త పద్ధతి ఇది!

ఒక మారు గోరాశాస్త్రి నాతో, "శ్రీ శ్రీ! నువ్వేమిటన్నా అనుకో. నా ఉద్దేశం మాత్రం ఇది! ఈ నాడు ఇండియాలోని రచయితలందరికన్నా నేనే గొప్పవాణ్ని" అన్నాడు. "నా ఉద్దేశం కూడా అదే!" అన్నాన్నేను.

"మహాప్రస్థానం" గీతాలన్నీ 30లలో రాశాను ("నిజంగానే," "గర్జించు రష్యా!" 41లో, "నీడలు" 47లో రాశాను) 30 నుంచి 40 దాకా సాగిన దశాబ్దాన్ని చరిత్రకారులు Hungry Thirties అంటారు. అప్పుడే అమెరికాలో ప్రారంభమైన అర్థికమాంద్యం ప్రపంచమంతటా వ్యాపించింది (ఒక్క సామ్యవాద రష్యాలో తప్ప) ఆ దశాబ్దంలోనే రెండవ ప్రపంచ యుద్ధానికి రిహార్సల్సుగా స్పెయిన్ అంతర్యుద్ధం సాగింది ఆడెన్, స్పెండర్, డేలూయిస్, డిలాన్‌థామస్, జార్జి బార్కర్ మొదలైన వారు గొప్ప రచనలు చేసింది ఆ కాలంలోనే ఇండియన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో అప్పుడే ఇంగ్లాండు నుంచి వెలువడింది ఇన్నియిన్ని ప్రవాహాల మధ్య నా మహాప్రస్థాన గీతాలు కూడా ప్రవహించాయి.

ఈ వాస్తవాలన్నింటికీ నేను స్పందించినా, ఇలాంటి రచనలను "సామాజిక వాస్తవికత" అంటారనీ, దీనికి వెనుక దన్నుగా "మార్క్సిజం" అనే దార్శనికత ఒకటి ఉందనీ అప్పటికి నాకు తెలియదు ఇప్పుడొక్కసారి వెనక్కి తిరిగి చూసుకుంటే, మహాప్రస్థాన గీతాలలోని మార్క్సిస్టు స్ఫూర్తి, సామాజికస్పృహ యాదృచ్ఛికాలు కావని స్పష్టంగా తెలుస్తోంది

ఒకటి మాత్రం నిశ్చయం. 1933లో "నేను సైతం ప్రపంచాగ్నికి" ఇత్యాది గీతంతో ప్రారంభించి కడసారిగా గ్రాంధిక శైలికీ, గణబద్ధ ఛ్ఛందస్సులకీ గుడ్‌బై కొట్టేశాను ఇదే గురజాడ అడుగుజాడ. అంతవరకు సుమారు వెయ్యేళ్లు అవ్యాహతంగా సాగుతూ నలిగిన క్లాసికల్ బండి దారి నుంచి గురజాడ తెలుగు కవిత్వానికి ఒక కొత్త మలుపు ఇచ్చాడు. రథాలూ, పల్లకీలూ, గుర్రబ్బళ్లూ వెళ్లేదారిని తప్పించి, మోటార్లూ, రైలుబళ్లూ తిరిగే అధునిక యుగానికి తెలుగు కవిత్వాన్ని మళ్లించాడు గురజాడ చూపించిన మలుపును నేను మహాప్రస్థాన గీతాలతో మరింత వెడల్పుచేశాను

ఇది టెక్నిక్‌కు సంబంధించింది గ్రాంధికంలో రాసే వృత్తాలు రథాల్లాంటివి. పల్లకీల్లాంటివి గురజాడ వాడుక భాషలో రాయమన్నాడు మాత్రా ఛ్ఛందస్సులను

వాడమన్నాడు. నేనందుకే ఉత్సాహంతో, ఉద్రేకంతో ఉద్యమించాను. ఇక విషయంలోకి వస్తే, అందమైన అబద్ధాలలోకన్నా, నిష్ఠురమైన నిజంలోనే మంచి కవిత్వం దర్శనీయమవుతుందని విశ్వసించాను దీనితో మహాప్రస్థాన గీతాలలో సామాజిక వాస్తవికతకు దర్పణంపట్టడం జరిగింది

దీని తర్వాతి మెట్టు సామ్యవాద వాస్తవికత దీన్నింకా మనం అందుకో లేదు. అందుకోకుండా పెట్టుబడి దారీ గుంటనక్కలు పెద్దపెద్ద కుట్రలే చేస్తున్నాయి అందుకు మద్దత్తుగా సాహిత్యంలో క్లాసిసిజం నిలబడింది

Classicism గురించి Herbert Read ఇలా అన్నాడు "Classicism, let it be said without further preface, represents for us now, and has always represented, the forces of oppression. Classicism is the intellectual counter part of political tyranny It was so in the ancient world and in the medieval empires; it was renewed to express the dictatorships of the him Renaissance and has ever been the official creed of Capitalism."

క్లాసిసిజంతో బాటు జాతీయ దురహంకారం కూడా అభ్యుదయ నిరోధకమైనదే దీనికి అంతర్జాతీయ దృక్పథమే విరుగుడు "చీనాలో రిక్షావాలా, చెక్ దేశపు గని పని మనిషీ" అంటూ నేనీ అంతర్జాతీయ తత్వాన్నే ఆహ్వానించాను బడుగు దేశాలవారు నాయిల్లు, నాదేశం అనుకుంటే అందులో అసమంజసం ఏమీలేదు కాని ఈ భావాలు మరీ ప్రకోపించి వెర్రితలలు వేస్తేనే ప్రమాదం. అప్పుడు నా యిల్లు, నాదేశం అంటే పొరుగింటిని కొల్లగొట్టడమూ, ఇతరదేశాలను దోచుకోవడమూ జరుగుతాయి సునిశితమైన అంతర్జాతీయ దృష్టితో ఈ దోపిడిని దుయ్యబట్టి తిప్పికొట్టడం కంటె మరో మహత్తరకర్తవ్యం మంచి కవిత్వానికుండబోదని నేనంటాను

"మహాప్రస్థానం"లో నేను చేసిందంతా సామాజిక రుగ్మతను నిదానించడం మాత్రమే. "ఇదీ మన ప్రపంచం! ఇలా ఉన్నారు ఇచ్చటి ప్రజలు!" అన్నాన్నేను ఇది సరైన రోగ నిదానమే కాని ఇంతటితో ఆగిపోకూడదు. జబ్బులకు తగ్గ మందు వెదకాలి. పైపై పూతలతో ఈ జబ్బులు కుదరవు కావలిసింది శస్త్రచికిత్స. దాన్నే "విప్లవం" అంటున్నాను.

"మహాప్రస్థానం"లో అభ్యుదయ కవిత్వమూ, విప్లవ బీజాలూ ఉన్నాయి విప్లవసాహిత్యం లేదు. "విప్లవ సాహిత్యం" అంటే ఏమిటి? సామాన్య ప్రజానీకాన్ని విప్లవాచరణ కుద్యుక్తుల్ని చేసే విధంగా సాగేదే!

ఇదీ నామాట. ఇక నా లండన్ ప్రచురణ కర్త అయిన కృష్ణమూర్తి గారికి కృతజ్ఞతలు తెలుపుతూ,

ఉంటాను.

లండన్,

15–12–'80

శ్రీ శ్రీ

# యోగ్యతా పత్రం

ఇది మహాప్రస్థానం సంగతి కాదు. ఇదంతా చెలం గొడవ. ఇష్టంలేని వాళ్ళు యీ పేజీలు తిప్పేసి (దీంట్లో మీ సెక్సుని ఉద్రేకించే సంగతులు ఏమీ లేవు) శ్రీశ్రీ అర్ణవంలో పడండి. పదండి ముందుకు అగాధంలోంచి బైలుదేరే నల్లని అలలు మొహానకొట్టి, ఉక్కిరి బిక్కిరై తుఫానుహోరు చెవుల గింగురుమని నమ్మిన కాళ్ళకింది భూమి దొలుచుకుపోతో వుంటే, ఆ చెలమే నయమని వెనక్కి పరిగెత్తి చూస్తారు.

తన 'కవిత్వానికి ముందుమాట వ్రాయమని శ్రీశ్రీ అడిగితే, కవిత్వాన్ని తూచేరాళ్ళు తన దగ్గర లేవన్నాడు చెలం 'తూచవద్దు అనుభవించి, పలవరించ'మన్నాడు శ్రీశ్రీ.

చెలం చూశాడు. మాట్లాడాడు. కాని 'శ్రీశ్రీని ఎరగడు. రుక్మిణీనాథశాస్త్రి ఒక ఉదయం వచ్చి---

"ఇదేమిటి, ఈ మూల స్త్రీల కోసం ఇట్లా మూలుగుతున్నారు? శ్రీశ్రీ పద్యాల వేగంతో ప్రపంచపు పాత దుమారమంతా వూడ్చుకుపోతోవుంటే!"

"హృదయాల మీది పెంకులు పగిలిపోతున్నాయి. బైట వినబడుతున్నాయి. ఇట్లారండి. రోడ్డుమీదికి" అన్నాడు.

అంతవరకు శ్రీశ్రీ కవిత్వాన్ని ఎరక్కపోవడం చెలంలో క్షమించతగిన విషయం కాదు. కాని చాలా వాటికి క్షమించాలి చెలాన్ని.

కవిత్వాన్ని, ముఖ్యంగా తెలుగు కవిత్వకన్యల్ని చూస్తే చెలానికి Impatience, అనుమానం. శబ్దసౌందర్యంతో తృప్తిపడి సంతోషించవలసిందే కాని, చెప్పేదానికి అర్థం వెతకడం అవివేకం అని. కాని నీరసపు కళాచతురులమల్లే అందాన్ని దూరంనించి చూసి సంతోషించీ, విచారించీ, తప్పుకోడం చెలానికి చాతకాదు. తను చెప్పదలచుకున్న సంగతి తనకే స్పష్టంగా తెలీనప్పుడు తన చాతగానితనాన్నీ, అర్థ అస్పష్టతనీ - ఛందస్సు చీరల వెనకా, అలంకారాల మధ్యా, కఠినపదాల బురఖాలలోనూ దాచి మోసగించాలని చూస్తాడు కవి - ముఖ్యంగా సహజ సౌందర్యం తక్కువైనప్పుడు! సులభంగా, సూటిగా చెప్పేసి, ఇంత ధ్యానానికీ, మౌనానికీ, కార్యాలకీ, విజయాలకీ వ్యవధి నివ్వరాదా అని చెలం కోర్కె. ఆ పని స్త్రీలూ చెయ్యరు, దేశనాయకులూ చెయ్యరు, కవులూ చెయ్యరు- ఎంకీ, శ్రీశ్రీ తప్ప. కవిత్వంలోనూ, జీవితంలోనూ economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్న హీనమైన పాపం. ఆత్మలోకంలో దివాలా.

తనకీ, ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవి చేసే అంతర్, బహిర్ యుద్ధారావమే కవిత్వ మంటాడు చెలం. అందువల్లనే - దిక్కుల్ని, దేవుళ్ని

అధికారుల్ని వ్యాగించి ప్రశ్నించే శ్రీ శ్రీ పద్యాలు అంత అభిమానం చెలానికి నెత్తురూ, కన్నీళ్ళూ తడిపి కొత్త Tonic తయారుచేశాడు శ్రీ శ్రీ యీ వృద్ధ ప్రపంచానికి.

హృదయం ఎల్లా కంపిస్తే ఆ కంపనకి మాటల రూపాన్ని యివ్వడం అతనికే తెలుసు, మాటల్ని కత్తులూ, యీటెలూ, మంటలుగా మార్చటం అతనికే చేతనవును పద్యాలు చదువుతోంటే, ఇవి మాటలు కావు, అక్షరాలు కావు– ఉద్రేకాలు, బాధలు, యుద్ధాలు – అతని హృదయంలోంచి మన హృదయంలోకి direct గా పంపిన ఉత్సాహాలు, నెత్తురు కాలవ అనిపిస్తుంది.

ఎందుకంటే---

క్రిష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తే శ్రీ శ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు.

క్రిష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీ శ్రీ బాధ

## 2

శ్రీ శ్రీ కవిత్వము, పాల్ రోబ్సన్ సంగీతమూ ఒకటే రకం అంటుంది సౌరిస్ ఆ రెంటికీ హద్దులూ, అడ్డులూ లేవు అప్పుడప్పుడు లక్షణాలనూ, రాగాలనూ మీరి చెవి క్రిరుమనేట్టు ఇద్దరూ అరుస్తారు. ఏమీ రసం లేకుండా flat గా ఎక్కడికో, ఏమీ చేతకాని వాళ్ళమల్లె జారిపోతారు. కాని ఆ అరుపుల్లో – చీకట్లో మొహాలు, తోకలూ కనపడక వెతుక్కునే ప్రజల రొద, గాలిదెబ్బల కింద ఎగిరిపడే సముద్రపు తుపాను గర్జనం, మరఫిరంగుల మరణధ్వానం గింగురుమంటాయి కంఠం తగ్గించి వినపడకుండా తగ్గుస్థాయిలో మూలిగారా, దిక్కులేని దీనుల మూగవేదన, కాలికింద నలిగిన చీమల కాళ్ళువిరిగిన చప్పుడు, నీళ్ళులేక ఎండుతున్న గడ్డిపోచ ఆర్తనాదం వినిపింపచేస్తారు. బుద్ధివున్న వాడెవ్వడూ అతనిది సంగీతమని కాని, ఇతనిది కవిత్వమని కాని వొప్పుకోడు; వొప్పుకోటమూ లేదు. ఎందుకంటే యీ యిద్దరి appeal బుద్ధిని, వివేకాన్ని, కళానిబంధనల్ని మించిన ఏ అంతరాళానికో తగులుతుంది – ఆ అంతరాళం అనేది వున్నవాళ్ళకి. కీర్తి మర్యాదల్ని డిగ్రీలతో కొలుచుకుంటో అగచాట్లు పడి కులికే మనుషులకి ఆత్మ ఎన్నో మందపు ఇనుపపొరల వెనక అణగి, చచ్చి, కొనవూపిరితో ఆరిపోలేక మిణుకు మిణుకు మంటో వుంటుంది. అటువంటివాళ్ళకి ఉత్త అర్థంలేని న్యూసెన్సుగా తోస్తాయి శ్రీ శ్రీ పద్యాలు. సొంత ఇల్లూ, అణగారిన భార్యా, ప్రతి సంవత్సరం పై క్లాసులోని కెళ్ళే కొడుకూ, bank-account, వొట్టిపోని ఆవుతో తృప్తిపడే సంసారుల శాంత హృదయాల మీదనుంచి యీ గీతాల్లోనిఉద్రేకఉత్సాహాలు విశాఖపట్నం సముద్రంలో నల్లరాళ్ళమీద అలలు విఫలమైనట్లు దొర్లిపోతాయి. తాంబూలం వేసుకుంటో, పుస్తకాన్ని ముడిచిపెట్టి "దేనికోసం? ఎందుకు? ఏమిటి కావాలంటాడు? ఏమిటి ఈ వేదన పాపం?" అని కొంచెం ఆలోచిస్తారేమో!

ఇదీ సాధారణంగా కల్చెర్డు రీడర్సు సంగతి.

కవుల సంగతివేరు. ఉత్తమ కవిత్వం ఎప్పుడు ప్రచురితమవుతుందా అస వెయ్యికన్నులతో కనిపెడుతో వుంటారు కనపడ్డదా, అనాటేనుంచి అతి శ్రద్ధగా ఆ కవిత్వాన్ని గురించీ, కవిని గురించీ ప్రచారం మొదలు సారస్వత పోషకులతో ఉచితులతో ఎట్లాగో ఓలాగు ఆ కొత్త కవిత్వాన్ని సంభాషణలోకి తీసుకునివచ్చి వ్యక్తీ, కాల పరిస్థితులను బట్టి చప్పరించడమూ – తమ కావ్యాలనించో, ఇతర కావ్యాలనించో, సంగ్రహించబడిన దనడమూ – విప్లవకారణ మనడమూ – నిర్జీవ మనడమూ – కవిని గురించి చాలా righteous indignation తోనో, జాలిపడుతోనో, చాలా సానుభూతీ, దయా వున్నట్లు ప్రస్తావించడమూ వీళ్ల టెక్నిక్

"శ్రీ శ్రీ కవిత్వాన్ని గురించి మీ అభిప్రాయం చెప్పండి" అని కవిని అడిగారా, అతను "దానికేం చాలా బావుంటుంది. ఓ బాగా వ్రాస్తాడు. నేను అతన్ని కూడా బాగా ఎరుగుదును నా అభిప్రాయం ఏమిటంటే –" అన్నాడా, అతను చాలా సన్నిహిత ప్రియమిత్రుడన్నమాట కవికి చిరునవ్వుతో శ్రీ శ్రీ విషయమై మీ కళ్ళలో కారం కొట్టి పోతున్నాడు. పొగడ్తలతో మీ నోట్లో విషం కక్కి పోతున్నాడు జాగ్రత్త!

శ్రీ శ్రీ కవిత్వానికి Motive springs చూపుతాడు ఆ మిత్రుడు. తప్పదు

"ఆకలిపాట.. కటిక దరిద్రుడు అతను – తిండిలేక వీధులు తిరిగాడు...పాపం" అంటో ప్రపంచపు సరిహద్దుల్ని వూగించాలని ప్రయత్నించే అతని హృదయోద్రేకాన్ని explain చేస్తాడు.

నిజమా? నిజమైతే శ్రీ శ్రీ "ఆకలేసి" నక్షత్రాలు అదరిచూసే "కేక లేశాడు."

ఈ కవికి ఆకలివేస్తే రా – గారి యింటికెళ్ళి శ్లాఘించి భత్య ఖర్చు తెచ్చుకుని, భోజనం చేసి ప్రియురాలిమీద గీతం వ్రాశాడు

అబద్ధాలతో, స్తోత్రాలతో, వంచనలతో, అనుకూల దుష్ట ప్రచారంతో, ఆత్మశ్లాఘనలతో దేశంమీదపడి బతుకుతున్న యీ Parasite కవివరేణ్యులు శ్రీ శ్రీని విమర్శించడానికి సాహసిస్తున్నారు 'అభివృద్ధికి తగినవాడవు' అని ఆకాశమంత ఎత్తుగా వుండే అతని వీపు తట్ట చూస్తున్నారు.

ప్రపంచంలో ఈనాడు ప్రతిదేశంలోనూ నూతన యుగనిర్మాణంకోసం ధర్మయుద్ధం చేసే ధీరులు ఈనాడూ పడుతున్న ఘోరమైన అగచాట్లు చూస్తే, అనాదిగా తనకోసం ప్రయత్నించే dreamers మీద ఈలోకం వర్షిస్తున్న కర్కశత్వం, వరించి ఆవేశించిన rotten channels యీనాటి సారస్వత సభాపతులు.

తాము బతికివున్న కాలంలో పాత వాఙ్మయం మీద తిరగబడ్డ యీ బతికివున్న శవాలు, ఈనాటికీ తాము ముప్పైయేళ్ళ క్రింద చేసిన తిరుగుబాటు ఇతరుల ఖర్చుమీద కాఫీ యిడ్లీల ముందు Inspire అయి ప్రగల్భాలు పలికే యీ రసికులు, తాము తెచ్చిన సంస్కారమే యింక సారస్వతానికి శాశ్వతావధి అని నిరూపించి, ఉప్పొంగి తెలుగు ప్రపంచాన్ని పావనం చెయ్యడానికి మీదికి ఉరికే భగీరథ ప్రవాహాన్ని ఊరి రబ్బిష్ చెత్తల కట్టలతో ఆపాలని ప్రయత్నిస్తున్నారు.

మద్రాసు బస్సుల గోలల మధ్య ఓసారి "శ్రీ శ్రీ ఇప్పుడు వ్రాస్తున్న క్రొత్తతనాలకే ప్రజలు ఇంకా అలవాటు కాలేదే. ఇంకా యీ సర్రియలిజం తెస్తే అసలు గాభరా పడి చదవడమే మానేస్తారేమో!" అన్నాడు చెలం. man of little faith.

శ్రీశ్రీ ఏం జవాబు చెపితేనేం! మానవజాతిని ఉద్ధరించడానికి కొత్త మతాన్ని కనిపెట్టిన ప్రవక్తవలె చిరునవ్వు నవ్వాడు తన వ్రాతలు అంగీకారాన్ని పొందేందుకు ఇరవైయేళ్ళ తర్వాత ఇంకా ఆశ వదలక కాచుకొనివున్న చెలం మానవత్వం మీద శ్రీశ్రీకి వున్న గాఢవిశ్వాసాన్ని చూసి తలవొంచాడు

శ్రీశ్రీ కవిత్వాన్ని analyse చేసి, ముక్కల కింద ఎత్తిచూపి, కవీ, మనిషీ, శైలీ, బాల్యం, కవిత్వం, ఛందస్సు, ఎదిరింపు, కొత్తపోకడలు, పాత Influences అంటో వాటి శ్రేష్ఠత్వాన్ని explain చెయ్యడానికి చెలానికి అధికారమూ, అర్హతలేవు. చెలానికి విమర్శే చాతనైతే, కొత్త వ్రాతల్ని పాత పత్రికల్లో చీల్చి, చెండాడి గొప్పతనం లేదని నిరూపించి, ఘనత సంపాయించి, సంవత్సరానికోసారి నిండు భోజనాలుచేసే ఒక డజన్ సారస్వత, కళా, నాటక, నృత్య, గాన, సినిమా పరిషత్తులలో సభ్యత్వం, ఏమో అదృష్టం అపూర్వంగా కలసివస్తే జాయింటు సెక్రటరీకూడా సంపాయించేవాడు కాడా!

శ్రీశ్రీ పుస్తకం కొని తీరికగా చదవండి, పద్యం పదిసార్లు చదవండి ఏమీ అర్థం కాలేదా – ఏ యువకుడికో, భిక్షుకుడికో, death - bed presentగా పంపండి. పారెయ్యకండి అంతకన్నా దాచుకోకండి తెలుగు కవిత్వాన్ని ఖండించి, దీవించి, ఊగించి, శాసించి, రక్షించే అపూర్వశక్తి మీ చేతులో పుస్తకం, pass it on.

పదేళ్ళు ఆగండి, ఈ లోపల ఆస్తిసంపాదించడం, పిల్లల్ని కనడం, ధరలు, హెచ్చడంకాక జీవితంలో ఇంకా ఏమన్నా మిమ్మల్ని అమితంగా influence చేసినవి జరిగివుంటే మళ్ళీ కొత్తకాపీ కొని శ్రీశ్రీ పద్యాల్ని చదవండి. అపుడన్నా అర్థమౌతుందేమో

స్వయంగా చదవండి. చదివిం తర్వాత శ్రీశ్రీని చూడాలనిపిస్తే స్వయంగా చూడండి. ఎవరి అభిప్రాయమూ అడగకండి ముఖ్యంగా కవి అనేవాణ్ణి .... చెప్పినా వినకండి.

## 3

కవిత్వపు కాలం అంతమయింది. నగలూ, అపురూపపు కళలూ, సూర్యకిరణాల్ని ఎరగని అందాలూ గతిస్తున్నట్టే కవిత్వమూ గతించింది. కవిత్వానికి కూడ తన ప్రయోజనం తానే చెప్పుకోవలసిన గతిపట్టింది. "ఈనాటి కవిత్వమంతా ఏమిటి? ఎందుకు వుంది? ఏం చేస్తోంది?" అని దిక్కరించి అడిగే తెలుగు ప్రజలకు శ్రీశ్రీ కవిత్వం ప్రత్యుత్తరం. కొద్ది రోజుల్లో నేడు విర్రవీగేకవులు ప్రతి ఒక్కరూ శ్రీశ్రీ నీడకింద నుంచుని తమ ఉనికిని సమర్థించుకోవలసిన గతి వొస్తుంది

చెప్పుకో తగిన ఒక్క కవీ మన క్రిష్ణశాస్త్రి – ఉన్నత హిమాలయ శిఖరాల్లో కురిసిన కవితా వర్షం పాయలై, దేశాలవెంట ప్రవహించి చివరకు సైదుకాలువల్లో పలుకుతున్న సమయాన, తన భీషణాతపజ్వాలలతో ఆవిరి పొగలు ఆకాశమార్గాన విహరింపజేసి, రక్షించాడు శ్రీశ్రీ.

ఎవరినించి దొంగిలించామో వాళ్ళని క్షమించడం కష్టం.

క్రిష్ణశాస్త్రి పద్యాలు చదివి, అర్థం విడదీసి, "ఏది గొప్పతనం చూప"మంటే చూపలేకపోయినాను పూర్వం శ్రీ శ్రీ అగ్గిపుల్లలోనూ, కుక్కపిల్లలోనూ కవిత్వం చూపమంటే చూపలేను ఈనాడూ.

అగ్గిపుల్లవంక – ముఖ్యం పుచ్చిన అగ్గిపుల్లవంక చాలాసేపు చూడమంటాను.

కుక్కపిల్లని – ముఖ్యం తల్లిచచ్చిన దిక్కులేని గజ్జికుక్క పిల్లని పెంచమంటాను.

మెరీనాలో గాలిలోఊగే (రేడియోలేని రోజులవి) flower-bed పుష్పశయ్య కేసి చూస్తున్న నన్ను చూచి, "ఈ పువ్వులు పాడు పువ్వులు! ఎక్కడ చూసినా రోడ్డు ప్రక్కన అంతా ఈ పువ్వులే" అని నన్ను నిందిస్తున్న మిత్రుడికి ఏం జవాబు చెప్పగలిగాను.

"ఏమిటి వొంతెన మీద నుంచుని చూస్తున్నావు?"

"సంధ్య కేసి"

"ఎవరు ఆమె?"

అంటే ఏం మాట్లాడగలిగాను?

పాత పదాలు, డిక్షన్, వర్ణనలు, అలంకారాలు, ఛందస్సు, ఉపమానాలు పద్ధతులు, ఆచారాలు కవిత్వంలోవీ, జీవితంలోవీ ఇంక మళ్ళీ లేవకుండా వాటి నడ్డి విరక్కొట్టాడు శ్రీ శ్రీ

"ధ్వంసం చేసి రోడ్డు వేశాను –"

"పదండి ముందుకు పడండి తోసుకు – " అంటున్నాడు.

తాము వేటిని ఎదిరించలేక ప్రతిదినమూ లొంగిపోతున్నారో, ఆ నిరంకుశాధికారుల నెత్తిమీద నాలుగు దెబ్బలు కొట్టాడని యువకులు చెలంమీద చూపే అభిమానం చాలదు శ్రీ శ్రీకి. తామూ యింకో నాలుగు దెబ్బలు కొట్టగల శక్తిని తెచ్చుకోమంటున్నాడు మనుషుల్ని.

శ్రీ శ్రీ ధ్వంసం చేసిన పాత ఛందస్సుల్లోంచి పాత మూలుగులూ, serenadings మూర్ఛలూ, వేదాంతాలూ, మత్తులూ పోయి–దేశాలకి ఉత్సాహాలకి కదిలిపోయే యువక సైన్యాలకి, నూతన యుగ నిర్మాతలకి background music కింద marching band కింద, కొత్తరక్తాన్ని కదను తొక్కించే సంగీతం వినపట్టంలేదా, శ్రీ శ్రీ గీతాల్లో వినపడకపోతే––

"ఎముకలు క్రుళ్ళిన, వయస్సు మళ్ళిన సోమరులారా చావండి!"

ప్రపంచం ఎట్లా పోతేనేం? మీ కెందుకులెండి.

"అదృష్టవంతులు మీరు...వడ్డించిన విస్తరి మీ జీవితం."

ప్రభుత్వాలు, న్యాయస్థానాలు, రక్షకభట వర్గాలు, చెరసాలలు, ఉరి కొయ్యలు, భావకవిత్వం ఇవన్నీ మీ ప్రియమిత్రులు. యుద్ధాలనించి, ముష్టి వాళ్ళనించి, విప్లవాలనించి, అనాధలనించి, అశాంతినించి, సత్యాన్నించి మిమ్మల్ని కాపాడుతారు వీళ్ళు.

వీళ్ళందరి అధ్యక్షుడూ మీ దేవుడు. మీ డబ్బుకి దాసుడు. మీ నంగి పూజలకీ స్వార్థ ప్రార్థనలకీ వశ్యుడు. దొంగభక్త పరాధీనుడు.

ఇన్ని బాంబులు కురుస్తున్నా, ఇన్ని మర ఫిరంగులు మోగుతున్నా, ఇన్ని చెరసాలలు నిండుతున్నా, ఇన్ని విప్లవాలు జరుగుతున్నా ఇంకా విశదం కాదా మీకు – పాత పద్ధతులు, విశ్వాసాలు, ధర్మాలు అన్నీ ఓ మూల నుంచి కూలిపోతున్నాయని! ఇంకా లాభం లేదనీ మీ ఆటలు యింక సాగవని!

ఈ విధ్వంసం అనంతరం నవ ప్రపంచ నిర్మాణ కర్తల ఉత్సాహంతో కంఠం కలిపి పాడుతున్నాడు శ్రీశ్రీ.

ఏ లోకంలో అన్యాయాలు, అధికారాలు, ఏడుపులు, క్షామాలు, యాచకాలు, క్షుద్ర కవిత్వాలు, శిక్షణలు, scandals లేవో ఆ లోకాన్ని dream చేస్తున్నాడు యీ కవి.

మీ ఆనందంకన్న ఇతరుల క్షోభ సంతృప్తినిచ్చే మీకు, నరకమంటే అట్లాంటి లోకం

శ్రీశ్రీ ఎందుకు నచ్చుతాడు?

ఇంకా రాత్రి చీకట్లో, లోకం నిద్రలో భయంకర స్వప్నాలు కంటో, దీనంగా పలవరించే సమయాన ఉషాగమనాన్ని గుర్తించి స్వాగతమిచ్చే వైతాళికుడు శ్రీశ్రీ.

దేవుడు, అధికారాలు, పాతర్లు, సౌఖ్యాలు, నీతులు, స్వర్గం, మర్యాదలు మూటకట్టుకుని కులికే మీకు అర్థంకాని బాధ, మరణం, దరిద్రం, అవిశ్వాసం, అశాంతి ఇవన్నీ అర్థంకాక గట్టిగా సృష్టినే ప్రశ్నిస్తున్న యువకుల లక్షకంఠాల్ని ఏకం చేసి పలుకుతున్నాడు శ్రీశ్రీ

మీ కెందుకు లెండి పట్టుదిళ్ళలో తలలు దూర్చి, భాగ్యవంతుల పాలిటి ఈశ్వరుడిమీద స్తోత్రశ్లోకాలు చదువుతూ — "All is well with the world" అనుకుంటో నిద్రపొండి.

*నిర్భాగ్యులం కొందరం మాకు—*
*"అన్నీ సమస్యలే, సందేహాలే."*
*"ఏవో,*
*ఏవేవో, ఏవేవో, ఘోషలు వినబడుతున్నాయ్! గుండెలు విడిపోతున్నాయ్?"*
*మీకు కవిత్వం కావాలా?*

అదుగో ఆ మూల పాతగోరీలకేసి మొహాలు తిప్పికొని నగిషీలు చెక్కుతున్నారు. పాత పదాలకీ, ఊహలకీ చిత్రికలుపట్టి – ప్రేయసి మెల్లకన్నులమీద పద్యాలు అల్లుతున్నారు – రామాయణాలూ, శర్మిష్ఠలూ, వృద్ధ మునులు వ్రాసి అర్పిస్తున్నారు. "భారతి"కి నైవేద్యంగా

వాళ్ళలో చేరండి వాళ్ళ ధైర్యవచనాలను విని మళ్ళీ నిద్రపొండి.

*"రాబందుల రెక్కల చప్పుడు పయోధర ప్రచండ ఘోషం. ఝంఝూనిల షడ్జధ్వానం"*

విని తట్టుకోగల చావ వుంటే ఈ పుస్తకం తెరవండి.

బెజవాడ,

17–7–1940.

చెలం

# ఇందులో...

# అంకితం
## (కొంపెల్ల జనార్దనరావుకోసం)

తలవంచుకు వెళిపోయావా, నేస్తం!
సెలవంటూ ఈ లోకాన్ని వదలి

తలపోసిన వేవీ కొనసాగకపోగా,
పరివేదన బరువు బరువు కాగా,
అటు చూస్తే, ఇటుచూస్తే ఎవరూ
చిరునవ్వో, చేయూతా ఇవ్వక–
మురికితనం కరకుతనం నీ
సుకుమారపు హృదయానకు గాయం చేస్తే,
అటుపోతే, ఇటుపోతే అంతా
అనాదరణతో, అలక్ష్యంతో చూసి,
ఒక్కణ్ణిచేసి వేధించారని, బాధించారని
వెక్కి వెక్కి ఏడుస్తూ వెళిపోయావా, నేస్తం!
తలవంచుకు వెళిపోయావా, నేస్తం!

దొంగలంజకొడుకులసలే మెసలే ఈ
ధూర్తలోకంలో నిలబడజాలక
తలవంచుకునే వెళిపోయావా, నేస్తం!
చిరునవ్వులనే పరిషేచన చేస్తూ...

అడుగడుగునా పొడచూపే
అనేకానేక శత్రువులతో,
పొంచి చీకట్లో కరవజూసే

వంచకాల ఈ లోకంతో పొసగక
అంచితానంత శాంత సామ్రాజ్యం
దేన్ని వెతుక్కుంటూ వెళ్ళావోయ్, నేస్తం!
ఎంత అన్యాయం చేశావోయ్, నేస్తం!
ఎన్ని ఆశలు నీమీద పెట్టుకొని,
ఎన్ని కలలు నీచుట్టూ పోగుచేసుకొని
అన్నీ తన్నివేశావా, నేస్తం!
ఎంత దారుణం చేశావయ్యా, నేస్తం!

బరంపురంలో మనం ఇంకా
నిన్నగాక మొన్న మాట్లాడుతున్నట్టే ఉంది!
కాకినాడ నవ్యసాహిత్య పరిషత్తును
కలకలలాడించిన నీ నవ్వు
కనబడకుండా కరిగిపోయిందా ఇంతట్లోనే!
విశాఖపట్టణం వీధుల్లో మనం
"ఉదయిని" సంచికలు పట్టుకు తిరగడం
జ్ఞాపకం ఉందా?
చెన్నపట్టణపు సముద్రతీరంలో మనం
అన్నీ పిచికగూళ్ళేనా కట్టింది?
సాహిత్యమే సమస్తమూ అనుకొని,
ఆకలీ, నిద్రా లేక,
ఎక్కడ ఉన్నామో, ఎక్కడకు పోతామో తెలియని
ఆవేశంతో,
చుక్కలలో ఆదర్శాలను లెక్కిస్తూ
ఎక్కడకో పోతూన్న మనల్ని
రెక్కపట్టి నిలబెట్టి లోకం
ఎన్నెన్ని దుస్సహ దృశ్యాలు చూపించి,
ఎన్నెన్ని దుస్తర విఘ్నాలు కల్పించి,
కలలకు పొగలనూ, కాటుకలనూ కప్పి,

శపించిందో, శరించిందో మనల్ని!
తుదకు నిన్ను విషవాగురలలోనికి లాగి,
ఊపిరితిత్తులను కొలిమితిత్తులుగా చేసి,
మా కళ్ళల్లో గంధక జ్వాలలు,
గుండెలలో గుగ్గిలపు ధూమం వేసి,
మా దారిలో ప్రశ్నార్థ చిహ్నాల
బ్రహ్మ చెముడు డొంకలు కప్పి,
తలచుకున్నప్పుడల్లా
తనువులో, అణువణువులో
సంవర్త భయంకర
ఝుంఝూపవనం రేగిస్తూ
ఎక్కడకు విసిరిందయ్యా నిన్ను!
ఎంత మోసగించిందయ్యా మమ్ము!

ఎవరు దుఃఖించారులే, నేస్తం! నువ్వు చనిపోతే,
ఏదో నేనూ, ఆరుగురు స్నేహితులూ తప్ప!
ఆకాశం పడిపోకుండానే ఉంది!
ఆఫీసులకు సెలవు లేదు!
సారాదుకాణాల వ్యవహారం
సజావుగానే సాగింది!
సానుభూతి సభలలో ఎవరూ
సాశ్రునేత్రాలు ప్రదర్శించలేదులే నీ కోసం!
ఎవరి పనులలో వాళ్ళు!
ఎవరి తొందరలో వాళ్ళు!
ఎవరికి కావాలి, నేస్తం!
ఏమయిపోతేనేం నువ్వు?
ఎవ్వరూ నిన్ను స్మరించడం లేదులే!
ఎవరికి కావాలి, నేస్తం! నువ్వు
కాగితంమీద ఒక మాటకు బలి అయితే,

కనబడని ఊహ నిన్ను కబళిస్తే!
అందని రెక్క నిన్ను మంత్రిస్తే! నిమంత్రిస్తే!
ఎవరికి కావాలి నీ నేస్తం?
ఏమయిపోతేనేం నువ్వు?
మా బురద రోజా హాజరు!
మా బురఖా మేము తగిలించుకున్నాం!
మా కాళ్ళకు డెక్కలు మొలిచాయి,
మా నెత్తికి కొమ్ములు లాగే!
మమ్మల్ని నువ్వు పోల్చుకోలేవు!

లేదు, నేస్తం! లేదు....
నీ ప్రాభవం మమ్మల్ని వదలలేదు!
నిరుత్సాహాన్ని జయించడం
నీ వల్లనే నేర్చుకుంటున్నాము!
ప్రతికూల శక్తుల బలం మాకు తెలుసు!
భయం లేదులే అయినప్పటికీ!
నీ సాహసం ఒక ఉదాహరణ!
నీ జీవితమే ఒరవడి!
నిన్ను వదలిన పోరాటం
నేడు అందుకొనక తప్పదు!

కావున ఈ నిరాశామయలోకంలో
కదనశంఖం పూరిస్తున్నాను!
ఇక్కడ నిలబడి నిన్ను
ఇవాళ ఆవాహనం చేస్తున్నాను!
అందుకో ఈ చాచిన హస్తం!
ఆవేశించు నాలో!
ఇలా చూడు నీ కోసం
ఇదే నా మహాప్రస్థానం! – *1938*

* * *

# మహాప్రస్థానం

మరో ప్రపంచం,
మరో ప్రపంచం,
మరో ప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు,
పదండి త్రోసుకు!
పోదాం, పోదాం పైపైకి!

కదం త్రొక్కుతూ,
పదం పాడుతూ,
హృదంతరాళం గర్జిస్తూ—
పదండి పోదాం,
వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?

దారిపొడుగునా గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు!
బాటలు నడచీ,
పేటలు కడచీ,
కోటలన్నిటిని దాటండి!
నదీ నదాలూ,
అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?

పదండి ముందుకు!
పదండి త్రోసుకు!

పోదాం, పోదాం, పైపైకి!
ఎముకలు క్రుళ్ళిన,
వయస్సు మళ్ళిన
సోమరులారా! చావండి!
నెత్తురు మండే,
శక్తులు నిండే,
సైనికులారా! రారండి!
"హరోం! హరోం హర!
హర! హర! హర! హర!
హరోం హరా!" అని కదలండి!
మరో ప్రపంచం,
మహా ప్రపంచం
ధరిత్రినిండా నిండింది!
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
ప్రభంజనంవలె హోరెత్తండీ!
భావ వేగమున ప్రసరించండీ!
వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె
పెళ పెళ పెళ పెళ విరుచుకు పడండి!
పదండి,
పదండి,
పదండి ముందుకు!
కనబడలేదా మరో ప్రపంచపు
కణకణమండే త్రేతాగ్ని?

ఎగిరి, ఎగిరి, ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు!
తిరిగి, తిరిగి, తిరిగి సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి!

సలసల క్రాగే చమురా? కాదిది
ఉష్ణరక్త కాసారం!
శివసముద్రమూ,
నయాగరావలె
ఉరకండీ! ఉరకండీ ముందుకు!
పదండి ముందుకు!
పడండి త్రోసుకు!
మరో ప్రపంచపు కంచు నగారా
విరామ మెరుగక మ్రోగింది!

త్రాచులవలెనూ,
రేచులవలెనూ,
ధనంజయునిలా సాగండి!
కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలు,
ఎర్రబావుటా నిగనిగలు,
హోమజ్వాలల భుగభుగలు? – *12–4–1934*

* * *

# జయభేరి

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!

నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను!

నేను సైతం
భువన ఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను!

☆ ☆ ☆

ఎండకాలం మండినప్పుడు
గబ్బిలంవలె
క్రాగిపోలేదా!

వానకాలం ముసిరిరాగా
నిలువు నిలువున
నీరు కాలేదా?
శీతకాలం కోతపెట్టగ
కొరడు కట్టీ,
ఆకలేసీ కేకలేశానే!

నే నొకణ్ణే
నిల్చిపోతే—

చంద్ర గాడ్పులు, వానమబ్బులు, మంచుసోనలు
భూమి మీదా
భుగ్నమౌతాయి!

నింగినుండీ తొంగిచూసే
రంగు రంగుల చుక్కలన్నీ
రాలి, నెత్తురు క్రక్కుకుంటూ
పేలిపోతాయి!

పగళ్ళన్నీ పగిలిపోయీ,
నిశీథాలూ విశీర్ణిల్లీ,
మహాప్రళయం జగం నిండా
ప్రగల్భిస్తుంది!

☆ ☆ ☆

నే నొకణ్ణే ధాత్రినిండా
నిండిపోయీ—
నా కుహూరుత శీకరాలే
లోకమంతా జల్లులాడే
ఆ ముహూర్తా లాగమిస్తాయి!

☆ ☆ ☆

నేను సైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను!

నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను!

నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను! – 2–6–1933

# ఒకరాత్రి

గగనమంతా నిండి, పొగలాగు క్రమ్మి–
బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను!

ఆకాశపు ఎడారి నంతటా, అకట!
ఈ రేయి రేగింది ఇసుక తుపాను!

గాలిలో కనరాని గడుసు దయ్యాలు
భూ దివమ్ములమధ్య ఊదుతున్నాయి!

నోరెత్తి, హోరెత్తి నాగులు సాగరము!
కరి కళేబరములా కదలదు కొండ!

ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన
ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి!

విశ్వమంతా నిండి, వెలిబూదివోలె–
బహుళ పంచమి జ్యోత్స్న భయపెట్టు నన్ను!

*– 12–8–1933*

# గంటలు

పట్టణాలలో, పల్లెటూళ్ళలో
బట్టబయలునా, పర్వతగుహలా,
ఎడారులందూ, సముద్రమందూ,
అడవుల వెంటా, అగడ్తలంటా,
ప్రపంచమంతా ప్రతిధ్వనిస్తూ

గంటలు! గంటలు! గంటలు! గంటలు!
గంటలు! గంటలు!
గణగణ గణగణ గణగణ గంటలు!
గణగణ గణగణ
గంటలు! గంటలు!

భయంకరముగా, పరిహాసముగా,
ఉద్రేకముతో, ఉల్లాసముతో,
సక్రోధముగా, జాలిజాలిగా,
అనురాగముతో, ఆర్భాటముతో,
ఒక మారిచటా, ఒక మారచటా

గంటలు! గంటలు!
గంటలు! గంటలు!

సింహములాగూ, సివంగిలాగూ,
ఫిరంగిలాగూ, కురంగిలాగూ,
శంఖములాగూ, సర్పములాగూ,
సృగాలమట్లూ, బిడాలమట్లూ,
పండితులట్లూ, బాలకులట్లూ,

గాణగాణ గణగణ
గణగణ గాణగాణ
గంటలు! గంటలు!
గంటలు! గంటలు!

కర్మాగారము, కళాయతనమూ,
కార్యాలయమూ, కారాగృహముల,
దేవునిగుడిలో, బడిలో, మడిలో
ప్రాణము మ్రోగే ప్రతిష్ఠలములో,
నీ హృదయములో, నా హృదయములో

గంటలు! గంటలు!
గంటలు! గంటలు!

ఉత్తరమందూ, దక్షిణమందూ,
ఉదయమునందూ, ప్రదోషమందూ,
వెన్నెలలోనూ, చీకటిలోనూ,
మండు టెండలో, జడిలో, చలిలో,
ఇపుడూ, అపుడూ, ఎపుడూ మ్రోగెడు

గంటలు! గంటలు! గంటలు! గంటలు!
గంటలు! గంటలు! గంటలు! గంటలు!
గణగణ గణగణ గంటలు! గంటలు!
గణగణ గంటలు!
గంటలు! గంటలు!

(E.A Poe వ్రాసిన The Bell కి అనువాదం కాదు)

– *18–2–1934*

* * *

# ఆకాశదీపం

గదిలో ఎవరూ లేరు,
గదినిండా నిశ్శబ్దం.
సాయంత్రం అరున్నర,
గదిలోపల చినుకులవలె చీకట్లు.

ఖండపరశుగళ కపాలగణముల
కనుకొలకులలో ఒకటివలె
చూపులేని చూపులతో తేరి
చూస్తున్నది గది.

గదిలోపల ఏవేవో ఆవిరులు.
దూరాన నింగిమీద
తోచిన ఒక చుక్క
మిణుకు చూపులు మెలమెల్లగా విసిరి
గదిని తలపోతతో కౌగిలించుకొంటున్నది.

ఒక దురదృష్టజీవి
ఉదయం ఆరున్నరకు
ఆ గదిలోనే ఆరిపోయాడు.

అతని దీపం ఆ గదిలో
మూలనక్కి మూలుగుతున్నది.
ప్రమిదలో చమురు త్రాగుతూ
పలు దిక్కులు చూస్తున్నది.

చీకటి బోనులో
సింహములా నిలుచున్నది.
కత్తిగంటు మీద
నెత్తుటి బొట్టులాగున్నది.
ప్రమిదలో నిలిచి
పలుదిక్కులు చూస్తున్నది దీపం.

అకస్మాత్తుగా ఆ దీపం
ఆకాశతారను చూసింది.
రాకాసి కేకలు వేసింది.
(నీకూ నాకూ చెవుల సోకని కేకలు.)
ఆకాశతార ఆదరపుచూపులు చాపింది.
అలసిపోయింది పాపం, దీపం.
ఆకాశతార ఆహ్వాన గానం చేసింది.
దీపం ఆరిపోయింది.
తారగా మారిపోయింది. *– 7-3-1934*

# ఋక్కులు

కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్లా-
హీనంగా చూడకు దేన్నీ!
కవితామయమేనోయ్ అన్నీ!
రొట్టెముక్కా, అరటితొక్కా, బల్లచెక్కా-
నీ వేపే చూస్తూ ఉంటాయ్!
తమ లోతు కనుక్కోమంటాయ్!
తలుపుగొళ్లెం, హారతిపళ్లెం, గుర్రపుకళ్లెం-
కాదేదీ కవిత కనర్హం!
ఔనౌను శిల్ప మనర్ఘం!
ఉండాలోయ్ కవితావేశం!
కానీవోయ్ రస నిర్దేశం!
దొరకదటోయ్ శోభాలేశం!
కళ్లంటూ ఉంటేచూసి,
వాక్కుంటే వ్రాసీ!
ప్రపంచమొక పద్మవ్యూహం!
కవిత్వమొక తీరని దాహం! – 14-4-1934

# అవతార

యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బు చాటున
ఖణేల్మన్నాయి!

నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు
ఉరికిపడ్డాయి!

ఉదయ సూర్యుని సప్తహయములు
నురుగులెత్తే
పరుగు పెట్టేయి!

కనకదుర్గా చండ సింహం
జూలు దులిపీ,
ఆవులించింధి!

ఇంద్రదేవుని మదపు టేనుగు
ఘీంకరిస్తూ,
సవాల్ చేసింది!

నంది కేశుడు రంకె వేస్తూ,
గంగడోలును
కదిపి గెంతేదు!

ఆదిసూకర వేద వేద్యుడు
ఘుర్ఘురిస్తూ,
కోర సాచాడు!

పుడమి తల్లికి
పురుటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి! – *14-4-1934*

# బాటసారి

కూటికోసం, కూలికోసం
పట్టణంలో బ్రతుకుదామని-
తల్లిమాటలు చెవిని పెట్టక
బయలుదేరిన బాటసారికి,
మూడురోజులు ఒక్క తీరుగ
నడుస్తున్నా దిక్కు తెలియక-
నడి సముద్రపు నావ రీతిగ
సంచరిస్తూ, సంచలిస్తూ,
దిగులు పడుతూ, దీనుడౌతూ
తిరుగుతుంటే-
చండ చండం, తీవ్ర తీవ్రం
జ్వరం కాస్తే,
భయం వేస్తే,
ప్రలాపిస్తే-
మబ్బుపట్టే, గాలికొట్టే,
వానవస్తే, వరదవస్తే,
చిమ్మచీకటి క్రమ్ముకొస్తే
దారితప్పిన బాటసారికి
ఎంత కష్టం!

కళ్ళు వాకిట నిలిపిచూచే
పల్లెటూళ్ళో తల్లి ఏమని
పలవరిస్తోందో....?
చింతనిప్పులలాగు కన్నుల
చెరిగిపోసే మంటలెత్తగ,

గుండుసూదులు గ్రుచ్చినట్లే,
శిరోవేదన అతిశయించగ,
రాత్రి, నల్లని రాతి పోలిక
గుండె మీదనె కూరుచుండగ,
తల్లిపిల్లే కల్ల దృశ్యం
కళ్ళ ముందట గంతులేయగ
చెవులుసోకని పిలుపులేవో
తలుచుకుంటూ, కలతకంటూ—
తల్లడిల్లే,
కెళ్ళగిల్లే
పల్లటిల్లే బాటసారికి
ఎంత కష్టం!

అతని బ్రతుకున కదే ఆఖరు!
గ్రుడ్డి చీకటిలోన గూబలు
ఘూకరించాయి;
వానవెలిసీ మబ్బులో ఒక
మెరుపు మెరిసింది;
వేగు జామును తెలియజేస్తూ
కోడి కూసింది;
విడిన మబ్బుల నడుమనుండీ
వేగుజుక్కా వెక్కిరించింది;
బాటసారి కళేబరంతో
శీతవాయువు ఆడుకుంటోంది!
పల్లెటూళ్ళో తల్లికేదో
పాడుకలలో పేగు కదిలింది!      – 18–5–1934

* * *

# ఆశాదూతలు

స్వర్గాలు కరిగించి, స్వప్నాలు పగిలించి,
రగిలించి రక్తాలు, రాజ్యాలు కదిపి–
ఒకడు తూరుపు దిక్కు_నకు!

పాపాలు పండించి, భావాలు మండించి,
కొలిమి నిప్పులు రువ్వి, విలయలయ నవ్వి–
ఒకడు దక్షిణ దిక్కు_!

ప్రాకారములు దాటి, ఆకాశములు తాకి,
లోకాలు ఘూకాల బాకాలతో నించి,
ఒక డుదీచికి!

సిందూర భస్మాలు, మందార హారాలు,
సాంద్రచందనచర్చ సవరించి
ఒకడు పడమటికి!

మానవకోటి సామ్రాజ్యదూతలు, కళా
యజ్ఞాశ్వముల్ గాలులై, తరగలై, తావులై,
పుప్పొళ్ళు, కుంకుమల్, పొగలై సాగిరి!

– *1–6–1934*

* * *

# ఐ

భూతాన్ని, యజ్ఞోపవీతాన్ని,
వైప్లవ్యగీతాన్ని నేను!
స్మరిస్తే పద్యం,
అరిస్తే వాద్యం,
అనల వేదికముందు అస్రనైవేద్యం!

లోకాలు, భవభూతి శ్లోకాలు,
పరమేష్ఠి జూకాలు నా మహోద్రేకాలు!
నా ఊహ చాంపేయమాల!
రస రాజ్యడోల!
నా ఊళ కేదారగౌళ!

గిరులు, సాగరులు, కంకేళికా మంజరులు,
ఝరులు నా సోదరులు!
నే నొక దుర్గం!
నాదొక స్వర్గం!
అనర్గళం, అనితరసాధ్యం, నా మార్గం;

– 1–6–1934

# శైశవ గీతి

పాపం, పుణ్యం, ప్రపంచమార్గం--
కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా,
అయిదారేడుల పాపల్లారా!

మెరుపు మెరిస్తే,
వాన కురిస్తే,
ఆకసమున హరివిల్లు విరిస్తే
అవి మీకే అని ఆనందించే
కూనలారా!

అచ్చటి కిచ్చటి కనుకోకుండా
ఎచ్చు టెచటికో ఎగురుతుపోయే,
ఈలలు వేస్తూ ఎగురుతుపోయే
పిట్టల్లారా!
పిల్లల్లారా!

గరికపచ్చ మైదానాల్లోనూ,
తామరపూవుల కోనేరులలో,
పంటచేలలో, బొమ్మరిళ్ళలో,
తండ్రి సందిటా, తల్లి కౌగిటా,
దేహధూళితో, కచభారంతో,
నోళుల వ్రేళులు, పాలబుగ్గలూ,
ఎక్కడ చూస్తే అక్కడ మీరై
విశ్వరూపమున విహరిస్తుండే

పరమాత్ములు
ఓ చిరుతల్లారా!

మీదే, మీదే సమస్త విశ్వం!
మీరే లోకపు భాగ్యవిధాతలు!
మీ హాసంలో మెరుగులు తీరును
వచ్చేనాళ్ళ విభాప్రభాతములు!
ఋతువుల రాణీ వసంతకాలం
మంత్రకవాటం తెరుచుకునీ,
కంచు వృషభముల అగ్నిశ్వాసం
క్రక్కే గ్రీష్మం కదలాడీ,
ఏళ్ళు, బయళ్ళూ, ఊళ్ళూ, బీళ్ళూ
ఏకంచేసే వర్షాకాలం,
స్వచ్ఛ కౌముదుల శరన్నిశీధినులు,
హిమానీ నిబిడ హేమంతములు,
చలివడకించే శైశిరకాలం
వస్తూ పోతూ దాగుడు మూతల
క్రీడలాడుతవి మీ నిమిత్తమే!
ఇవాళలాగే ఎప్పుడు కూడా
ఇనబింబం పయనించు నింగిపై!
ఎప్పుడు కూడా ఇవాళలాగే
గాలులు వీచును, పూవులు పూచును!
నాకు కనంబడు నానాతారక,
లనేక వర్ణా, లనంత రోచులు
దిక్కుదిక్కులా దివ్యగీతములు
మీరూ వీటికి వారసులే! ఇవి
మీలో కూడా మిలమిలలాడును!

నా గత శైశవ రాగమాలికల
ప్రతిధ్వనులకై,
పోయిన బాల్యపు చెరిగిన పదముల
చిహ్నాల కోసం,
ఒంటరిగా కూర్చుండి ఊరుపులు
కదిలే గాలికి కబళము నిస్తూ,
ప్రమాద వీణలు కమాచి పాడగ
సెలయేళ్ళను, లేళ్ళను లాలిస్తూ,
పాతాళానికి పట్టీకొట్టే
వైతరణీనది లోతులు చూస్తూ,
శాంతములే, కేకాంతముగా, ది
గ్భ్రాంతిలో మునిగి గుటకలు వేస్తూ,
మెటిక విరిస్తూ ఇట కూర్చుండిన
నను చూస్తుంటే నవ్వొస్తోందా?
ఉడుతల్లారా!
బుడతల్లారా!
ఇది నా గీతం, వింటారా? – 9–6–1934

* * *

# అవతలి గట్టు

—ఇవేమిటీ వింత భయాలు?
—ఇంట్లో చీకటి!

—ఇవేమిటీ అపస్వరాలు?
—తెగింది తీగ!

—అవేమిటా రంగుల నీడలు?
—చావూ, బ్రదుకూ!

—ఎచటికి పోతా వీ రాత్రి?
—అవతలి గట్టుకు! – *16–6–1934*

* * *

# సాహసి

ఎగిరించకు లోహవిహంగాలను!
కదిలించకు సుప్త భుజంగాలను!
ఉండనీ,
మస్తిష్క కులాయంలో!
మనోవల్మీకంలో!

అంతరాళ భయంకర
ప్రాంతరాలనా నీ విహారం?
ముళ్ళదారినా నీ సంచారం?

పలికించకు మౌనమృదంగాలను!
కెరలించకు శాంత తరంగాలను!
హృదయంలో దీపం పెట్టకు!
మంత్రనగరి సరిహద్దులు ముట్టకు! – 9–7–1934

# కళారవి

పోనీ, పోనీ,
పోతే పోనీ!
సతుల్, సుతుల్, హితుల్ పోనీ!
పోతే పోనీ!

రానీ, రానీ,
వస్తే రానీ!
కష్టాల్, నష్టాల్,
కోపాల్, తాపాల్, శాపాల్ రానీ!
వస్తే రానీ!
తిట్లూ, రాట్లూ, పాట్లూ, రానీ!
రానీ, రానీ!

కానీ, కానీ!
గానం, ధ్యానం!
హాసం, లాసం!
కానీ, కానీ!
కళారవీ! పవీ! కవీ! – 11–7–1934

* * *

# భిక్షువర్షీయసి

దారిపక్క, చెట్టు క్రింద,
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసల్దొకతె
మూలుగుతూ, ముసురుతున్న
ఈగలతో వేగలేక.

ముగ్గుబుట్టవంటి తలా,
ముడుతలు తేరిన దేహం,
కాంతిలేని గాజుకళ్ళు,
తనకన్నా శవం నయం.

పడిపోయెను జబ్బుచేసి;
అడుక్కునే శక్తిలేదు;
రానున్నది చలికాలం;
దిక్కులేని దీనురాలు.

ఏళ్ళు ముదిరి, కీళ్ళు కదలి,
బతుకంటే కోర్కె సడలి—
పక్కనున్న బండరాతి
పగిదిగనే పడి ఉన్నది.

"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరి"దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
వెళ్ళిపోయింది!

ఎముక ముక్క కొరుక్కుంటు
ఏమీ అనలేదు కుక్క!
ఒక ఈగను పడవేసుకు
తొందరగా తొలగె తొండ!

క్రమ్మె చిమ్మచీకట్లూ,
దుమ్ము రేగె నంతలోన.
"ఇది నా పాపం కా"దనె
ఎగిరి వచ్చి ఎంగిలాకు!

*– 13-8-1934*

* * *

# ఒక క్షణంలో

ఒక క్షణంలో
మనస్సులో ఏదో స్మృతి
తటిన్మణి
మణీఘృణి
ఏదో మతి వికాసించి,

క్షణంలో
అదే పరుగు
మరేడకో...
ఆకులలో చీకటిలో
ఇరుల ఇరుకులలో
చినుకులలో
ఏడనో మరపులలో
మరపుల మడతలలో
కనబడక!

ఒక క్షణంలో
పూర్వపు సఖుని ముఖం
నవ్వులతో
రంగుల పువ్వులతో
కలకలమని కళలు కురిసి
హర్షంతో
ఆశావర్షంతో
కనులవెనుక తెరముందర
కనిపించి,

మరుక్షణం
విడివడి మరేడకో-
వడివడి మరేడకో!

ఒక క్షణంలో
సకల జగం!
సరభస గమనంతో...
పిమ్మట నిశ్శబ్దం.

ఆ క్షణమందే
గుండెల కొండలలో
మ్రోగును మ్రార్మోగును
హాలాహలి పరుగెత్తే
యుగాల రథనాదం. - 30-10-1934

* * *

# పరాజితులు

అలసిన కన్నులు కాంచేదేమిటి?
తొణకిన స్వప్నం,
తొలగిన స్వర్గం!

చెదిరిన గుండెల నదిమే దేమిటి?
అవతల, ఇవతల
అరులై ఇరులే!

విసిగిన ప్రాణుల పిలిచే దెవ్వరు?
దుర్గతి, దుర్గతి,
దుర్మతి, దుర్మృతి! – 27–1–1935

# ఆః!

నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నే నెగిరిపోతే,
నిబిడాశ్చర్యంతో వీరు-

నెత్తురు క్రక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే,
నిర్దాక్షిణ్యంగా వీరె... – 2-2-1935

# ఉన్మాది

అలకలన్నీ అట్టకట్టిన,
బొమికలన్నీ ప్రోవుపట్టిన,
కాగితంవలె పలచబారిన
వెర్రివాడా! కుర్రవాడా!

వీధికంతా వెక్కిరింతగ,
ఊరికంతా దిష్టిబొమ్మగ,
తూముప్రక్కన ధూళిలోనే
తూలుతున్నావా!

నీవు చూసే వెకిలిచూపూ,
నీవు తీసే కూనిరాగం,
మాకు తెలియని నీ ప్రపంచపు
మహారణ్యపు చిక్కుదారులు!

వెర్రివాడా! కుర్రవాడా!
నిన్ను చూసీ చూడనట్లే
తెలివిమీరిన పెద్దమనుషులు
తొలగిపోతారు!

వెర్రివాడా! కుర్రవాడా!
క్షమిస్తావా? సహిస్తావా?
బుద్ధిమంతులు నీకు చేసిన
దురన్యాయాన్ని!

అట్లు చూడకు, అట్లు పాడకు,
మమ్ము వేళాకోళ మాడకు!
వెర్రివాడా! కుర్రవాడా!
వేడుకుంటాము. – *1935 (?)*

※ ※

# స్విన్‌బర్న్ కవికి

విషంగ్రక్కే భుజంగాలో,
కదం త్రొక్కే తురంగాలో,
మదంపట్టిన మాతంగాలో కవీ, నీ పాటల్!

వలయ విచల ద్విహంగాలో,
విలయ సాగర తరంగాలో,
యుద్ధగుంజన్మృదంగాలో కవీ, నీ పాటల్!

షెల్లీకవనపు హల్లీసకమూ,
ఫ్రెంచిగీతుల మంచిరీతులు,
మోహినీ గంధర్వగానం కవీ, నీ పాటల్!

ఎఱ్ఱకాంతుల ఇనోదయమూ,
రెక్కవిప్పిన రివల్యూషన్,
కడలి వలపూ, వలపు కడలీ కవీ, నీ పాటల్!

కవీ! నీ గళ గళన్మంగళ
కళాకాహళ హళాహళిలో
కలసిపోతిని! కరగిపోతిని!
కానరాకే కదలిపోతిని! – *1936 (?)*

# అద్వైతం

ఆనందం అర్ణవమైతే,
అనురాగం అంబరమైతే

అనురాగపు టంచులు చూస్తాం,
ఆనందపు లోతులు తీస్తాం.

నీ కంకణ నిక్వాణంలో,
నా జీవన నిర్వాణంలో-
నీ మదిలో డోలలు తూగీ,
నా హృదిలో జ్వాలలు రేగీ-
నీ తలపున రేకులు పూస్తే,
నా వలపున బాకులు దూస్తే-

మరణానికి ప్రాణం పోస్తాం,
స్వర్గానికి నిచ్చెన వేస్తాం.

హసనానికి రాణివి నీవై,
వ్యసనానికి బానిస నేనై-
విషమించిన మదీయ ఖేదం,
కుసుమించిన త్వదీయ మోదం-
విషవాయువులై ప్రసరిస్తే,
విరితేనియలై ప్రవహిస్తే-

ప్రపంచమును పరిహసిస్తాం,
భవిష్యమును పరిపాలిస్తాం.

వాసంత సమీరం నీవై,
హేమంత తుషారం నేనై-
నీ ఎగిరిన జీవవిహంగం
నా పగిలిన మరణమృదంగం-
చిగురించిన తోటలలోనో,
చితులుంచిన చోటులలోనో-
వలయములై చలించినపుడే,
విలయములై జ్వలించినపుడే-

కాలానికి కళ్ళెం వేస్తాం,
ప్రేమానికి గొళ్ళెం తీస్తాం.

నీ మోవికి కావిని నేనై,
నా భావికి దేవివి నీవై-
నీ కంకణ నిక్వాణంలో,
నా జీవన నిర్వాణంలో-
ఆనందం అర్ణవమైతే,
అనురాగం అంబరమైతే-

ప్రపంచమును పరిహసిస్తాం,
భవిష్యమును పరిపాలిస్తాం.

(A.C. Swinburne తన రచనలలో, ముఖ్యంగా
A Match అనే గీతంలో చూపిన మార్గానికి కృతజ్ఞతతో)

*- 1936 (?)*

# వాడు

అందరం కలిసి చేసిన ఈ
అందమైన వస్తుసముదాయం అంతా
ఎక్కడో ఒక్కడే వచ్చి
ఎత్తుకు పోతూ ఉంటే చూచి,
"అన్యాయం, అన్యాయం?" అని మేమంటే-
"అనుభవించాలి మీ కర్మం" అంటాడు.

పొద్దుపొడిచి పొద్దుగడిచేదాకా
ఎద్దుల్లాగు పనిచేసే మిమ్మల్ని
మొద్దుల్నీ, మొరటుల్నీ చేసి
ముద్దకి కూడా దూరం చేశాడు
"ఘోరం ఇది, దారుణం ఇ"దంటే-
"ఆచారం! అడుగు దాటరా" దంటాడు.

భరించడం కష్టమైపోయి
పనిముట్లు మేము క్రిందను పడవైచి-
"చెయ్యలేం, చస్తున్నాం మేము,
జీవనానికి ఆసరా చూపించ" మంటే-
నోరుమూసి, జోడుతీసి కొట్టి
"దౌర్జన్యానికి దౌర్జన్యం మం" దంటాడు.

*- 1937 (?)*

# అభ్యుదయం

ఏవో.
ఏవేవో, ఏవేవో
ఘోషలు వినబడుతున్నాయ్!
గుండెలు విడిపోతున్నాయ్!

ఎవరో,
ఎవరెవరో, ఎవరెవరో
తల విరబోసుకు
నగ్నంగా నర్తిస్తున్నారు!భయో
ద్విగ్నంగా వర్తిస్తున్నారు!

అవిగో! అవి గవిగో! అవి గవిగో!
ఇంకిన, తెగిపోయిన, మరణించిన
క్రొన్నెత్తురు! విపంచికలు! యువయోధులు!

నేడే, ఈనాడే, ఈనాడే-
జగమంతా బలివితర్ది!
నరజాతికి పరివర్తన!
నవజీవన శుభసమయం!
అభ్యుదయం! – 2-4-1937

# వ్యత్యాసం

అదృష్టవంతులు మీరు,
వెలుగును ప్రేమిస్తారు,
ఇరులను ద్వేషిస్తారు,
మంచికీ చెడ్డకీ నడుమ
కంచుగోడలున్నాయి మీకు.

మంచి గదిలోనే
సంచరిస్తాయి మీ ఊహలు.
ఇదివరకే ఏర్పడిందా గది.
అందుకే వడ్డించిన విస్తరి మీ జీవితం.
నిశ్చల నిశ్చితాలు మీవి.
మంచిని గురించి,
మర్యాద, మప్పితం గురించి,
నడతా, నాణ్యం, విలువల విషయం
నిశ్చల నిశ్చితాలు మీవి.

మీ కన్నుల చూపులు సరళ రేఖలో!
రేఖ చెదిరితే గొల్లుమని పోతారు.
రేఖ కవతలి వారంతా నేరగాళ్ళు.

రేఖను రక్షించడానికే
న్యాయస్థానాలు, రక్షకభట వర్గాలు,
చెరసాలలు, ఉరికొయ్యలు,
రేఖను కాపాడక తీరదు.

అభాగ్యులం మేము,
సరిహద్దులు దొరకని
సంధ్యలలో మా సంచారం.
అన్నీ సమస్యలే సందేహాలే మాకు.
వెలుగులోని చీకట్లే,
ఇరులలోని మిణుగురులే చూస్తాం.
నూరు దోషాలలోని ఒక సుగుణం,
నూరు పుణ్యాలలోని ఒక ఘోరం!
వ్యత్యాసాలూ, వ్యాఘాతాలే
అడుగడుగునా మాకు.
మా వంట మేమే వండుకోవాలి.
ఒక్కొక్కమారు విస్తరే దొరకదు,
జీవితపు సన్నని సందులకే
ఆకర్షణ మాకు.

మా దృష్టిది వర్తుల మార్గం.
ఆద్యంత రహితం.
సంధ్యా జీవులం, సందేహ భావులం.
ప్రశ్నలే, ప్రశ్నలే.
జవాబులు సంతృప్తిపరచవు.
మాకు గోడలు లేవు.
గోడలను పగులగొట్టడమే మా పని.

అలజడి మా జీవితం.
ఆందోళన మా ఊపిరి.
తిరుగుబాటు మా వేదాంతం.

ముళ్ళూ, రాళ్ళూ, అవాంతరాలెన్ని ఉన్నా
ముందు దారి మాది

ఉన్నచోటు చాలును మీకు.
ఇంకా వెనక్కి పోతామంటారు కూడా
మీలో కొందరు.

ముందుకు పోతాం మేము.
ప్రపంచం మా వెంట వస్తుంది.

తృప్తిగా చచ్చిపోతారు మీరు.
ప్రపంచం మిమ్మల్ని మరిచి పోతుంది.

అభిప్రాయాల కోసం
బాధలు లక్ష్యపెట్టనివాళ్ళు
మాలోకి వస్తారు.

అభిప్రాయాలు మార్చుకొని
సుఖాలు కామించే వాళ్ళు
మీలోకి పోతారు.

*– 25–4–1937*

# మిథ్యావాది

మాయంటావా? అంతా
మిథ్యంటావా?
నా ముద్దుల వేదాంతీ?
ఏ మంటావు?
మాయంటావూ? లోకం
మిథ్యంటావూ?

కనబడినది కనబడదని
వినబడినది వినబడదని
జగతి మరపు, స్వప్నం, ని
శ్శబ్దం, ఇది
మాయ! మాయ!
మాయంటావూ? అంతా!
మిథ్యంటావూ?

జమీందారు రోల్సుకారు
మాయంటావూ? బాబూ
ఏమంటావు?

మహారాజు మనీపర్సు
మాయంటావూ? స్వామీ
ఏ మంటావు?

మరఫిరంగి, విషవాయువు
మాయంటావూ? ఏం,
ఏమంటావు?

పాలికాపు నుదుటి చెమటా,
కూలివాని గుండె చెరువు,
బిచ్చగాని కడుపు కరువు
మాయంటావా?

తుపానులూ, భూకంపం,
తిరుగుబాట్లు, సంగ్రామం,
సంగ్రామం, సంగ్రామం,
మాయంటావా? ఏయ్
ఏమంటావు?

జగతి మరపు, స్వప్నం, ని
శ్శబ్దం, ఇది
మాయ! మాయ! మాయ! మాయ!
మాయ! మాయ!
మాయంటావా? అంతా
మిథ్యంటావా? – *1937*

# ప్రతిజ్ఞ

పొలాల నన్నీ,
హలాల దున్నీ,
ఇలాతలంలో హేమం పిండగ-
జగానికంతా సౌఖ్యం నిండగ-
విరామ మెరుగక పరిశ్రమించే,
బలం ధరిత్రికి బలి కావించే,
కర్షక వీరుల కాయం నిండా
కాలువకట్టే ఘర్మజలానికి,
ఘర్మజలానికి,
ధర్మజలానికి,
ఘర్మజలానికి ఖరీదు లేదోయ్!

నరాల బిగువూ,
కరాల సత్తువ
వరాల వర్షం కురిపించాలని,
ప్రపంచ భాగ్యం వర్ధిల్లాలని-
గనిలో, వనిలో, కార్ఖానాలో
పరిక్లమిస్తూ,
పరిప్లవిస్తూ,
ధనికస్వామికి దాస్యంచేసే,
యంత్రభూతముల కోరలు తోమే,
కార్మిక వీరుల కన్నుల నిండా
కణ కణ మండే,
గలగల తొణకే

విలాపాగ్నులకు, విషాదాశ్రులకు
ఖరీదుకట్టే షరాబు లేడోయ్!

నిరపరాధులై దురదృష్టంచే
చెరసాలలలో చిక్కేవాళ్ళూ-
లోహ రాక్షసుల పదఘట్టనచే
కొనప్రాణంతో కనలేవాళ్ళూ-
కష్టం చాలక కడుపుమంటచే
తెగించి సమ్మెలు కట్టేవాళ్ళూ-
శ్రమ నిష్ఫలమై, జని నిష్ఠురమై,
నూతిని గోతిని వెదకేవాళ్ళూ-
అనేకులింకా అభాగ్యులంతా,
అనాథులంతా,
అశాంతులంతా
దీర్ఘశ్రుతిలో, తీవ్రధ్వనితో
విప్లవశంఖం వినిపిస్తారోయ్!

కావున-లోకపుటన్యాయాలూ,
కాల్చేఆకలి, కూల్చే వేదన,
దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ
పరిష్కరించే, బహిష్కరించే
బాటలు తీస్తూ, పాటలు వ్రాస్తూ,
నాలో కదలే నవ్యకవిత్వం
కార్మిక లోకపు కల్యాణానికి,
శ్రామిక లోకపు సౌభాగ్యానికి
సమర్పణంగా, సమర్చనంగా-
త్రిలోకాలలో, త్రికాలాలలో
శ్రమైక జీవన సౌందర్యానికి
సమానమైనది లేనేలేదని

కష్టజీవులకు, కర్మవీరులకు
నిత్యమంగళం నిర్దేశిస్తూ,
స్వస్తివాక్యములు సంధానిస్తూ,
స్వర్ణవాద్యములు సంరావిస్తూ–
వ్యథార్త జీవిత యథార్థ దృశ్యం
పునాదిగా ఇక జనించబోయే
భావివేదముల జీవనాదములు
జగత్తుకంతా చవులిస్తానోయ్!

కమ్మరి కొలిమీ, కుమ్మరి చక్రం,
జాలరి పగ్గం, సాలెల మగ్గం,
శరీరకష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి,
సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు–
నా వినుతించే,
నా విరుతించే,
నా వినిపించే నవీన గీతికి,
నా విరచించే నవీన రీతికి,
భావ్యం!
భాగ్యం!
ప్రాణం!
ప్రణవం. – 7–5–1937

# చేదుపాట

ఔను నిజం, ఔను నిజం,
ఔను నిజం, నీ వన్నది,
నీ వన్నది, నీ వన్నది,
నీ వన్నది నిజం, నిజం!

లేదు సుఖం, లేదు సుఖం,
లేదు సుఖం జగత్తులో!
బ్రతుకు వృథా, చదువు వృథా,
కవిత వృథా! వృథా, వృథా!

మనమంతా బానిసలం,
గానుగలం, పీనుగులం!
వెనుక దగా, ముందు దగా,
కుడి యెడమల దగా, దగా!

మనదీ ఒక బ్రదుకేనా?
కుక్కలవలె, నక్కలవలె!
మనదీ ఒక బ్రదుకేనా?
సందులలో పందులవలె!

నిజం సుమీ, నిజం సుమీ,
నీ వన్నది నిజం సుమీ!
బ్రతుకు ఛాయ, చదువు మాయ,
కవిత కరక్కాయ సుమీ!

లేదు సుఖం, లేదు రసం,
చేదు విషం జీవఫలం!
జీవఫలం చేదువిషం,
చేదు విషం, చేదు విషం!

ఔను నిజం, ఔను సుమా,
ఔను నిజం నీవన్నది!
నీ వన్నది, నీ వన్నది,
నీ వన్నది నిజం, నిజం! – *14–5–1937*

* * *

# కవితా! ఓ కవితా!

కవితా! ఓ కవితా!
నా యువకాశల నవపేశల సుమగీతావరణంలో
నిను నే నొక సుముహూర్తంలో,
అతిసుందర సుస్యందనమందున
దూరంగా వినువీధుల్లో విహరించే
అందని అందానివిగా
భావించిన రోజులలో,
నీకై బ్రతుకే ఒక తపమై
వెదుకాడే నిమిషాలందు నిషాలందున,
ఎటు నే చూచిన చటులాలంకారపు
మటుమాయల నటనలలో
నీ రూపం కనరానందున,
నా గుహలో, కుటిలో, చీకటిలో
ఒక్కడనై స్రుక్కిన రోజులు లేవా?

నీ ప్రాబల్యంలో,
చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో,
నిశ్చల సమాధిలో,
స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన నా
మస్తిష్కంలో
ఏయే ఘోషలు, భాషలు, దృశ్యాల్ తోచాయో?
నే నేయే చిత్ర విచిత్ర శ్యమంత
రోచిర్నివహం చూశానో!
నా గీతం ఏయే శక్తులలో

ప్రాణస్పందన పొందిందో?
నీకై నే నేరిన వేయే ధ్వనులో,
ఏయే మూలల వెదికిన ప్రోవుల
ప్రోవుల రణన్నినాదాలో;
నడి రేయాకస మావర్తించిన,
మేఘాలా వర్షించిన,
ప్రచండ ఝుంఝూ ప్రభంజనం
గజగజ లాడించిన
నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన
శంఖారావం, ఢంకాధ్వానం;
ఆ రాత్రే,
కారడవులలో లయాతీతమై
విరుతించిన నానాజంతుధ్వనులో;
నక్షత్రాంతర్నిబిడ నిఖిలగానం,
భూకంపాలు, ప్రభుత్వ పతనాలు,
విప్లవం, యుద్ధం
అన్నీ నీ చైతన్యం!
నీ విశ్వరూప సాక్షాత్కారం

మరి నిన్ను స్మరిస్తే
నా కగుపించే దృశ్యాలా?
వినిపించే భాష్యాలా?
అగ్ని సరస్సున వికసించిన వజ్రం!
ఎగిరే లోహశ్యేనం!
ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం

ఇంకా నే నేం విన్నానా?
నడిరే నిద్దురలో
అపుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని

రుచిర స్వప్నాలను కాంచే
జవరాలి మనఃప్రపంచపు టావర్తాలు
శిశువు చిత్ర నిద్రలో
ప్రాచీన స్మృతులూచే చప్పుడు!
వైద్యశాలలో,
శస్త్రకారుని మహేంద్రజాలంలో,
చావు బ్రతుకుల సంధ్యాకాలంలో
కన్నులు మూసిన రోగార్తుని
రక్తనాళ సంస్పందన!
కాలువ నీళులలో జారిపడి
కదలగనైనా చాలని
త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన!
ప్రేలాపన!
కడుపు దహించుకుపోయే
పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధల పాటల పల్లవి!
ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం!
ఉన్మాది మనస్సినీవాలిలో
ఘూకం కేకా, భేకంబాకా!
సమ్మెకట్టిన కూలీల,
సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల
ఆకటి చీకటి చిచ్చుల
హాహాకారం! ఆర్తారావం!
ఒక లక్ష నక్షత్రాల మాటలు,
ఒక కోటి జలపాతాల పాటలు,
శతకోటి సముద్రతరంగాల మ్రోతలు!
విన్నానమ్మా! విన్నా, నెన్నో విన్నాను

నా విన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే –
అవి,
పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువుల దాటి,
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి,
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి –
వడిగా, వడివడిగా
వెలువడినై, పరుగిడినై, నా యెదనడుగిడినై!
ఆ చెలరేగిన కలగాపులగపు
విలయావర్తపు
బలవత్ ఝురవత్ పరివర్తనలో,
నే నేయే వీధులలో
చంక్రమణం చేశానో,
నా సృష్టించిన గానంలో
ప్రక్షాళిత మామక పాపపరంపర
లానంద వశంవద హృదయుని జేస్తే –
నీకై మేలుకొనిన
సకలేంద్రియములతో
ఏది రచిస్తున్నానో, చూస్తున్నానో,
ఊపిరి తీస్తున్నానో,
నిర్వికల్ప సమాధిలో
నా ప్రాణం నిర్వాణం పొందిందో,
అటు నను మంత్రించిన,
సమ్ముగ్ధం గావించిన ఆ గాంధర్వానికి,
తారా నివహపు ప్రేమ సమాగమంలో
జన్మించిన సంగీతానికి.....
నా నాడుల తీగలపై సాగిన

నాద బ్రహ్మపు పరిచుంబనలో,
ప్రాణావసానవేళాజనితం,
నానాగానానూనస్వానావళితం,
బ్రదుకును ప్రపంచభేరుండ గరు
త్పరిరంభంలో పట్టిన గానం,
సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతం.
అమోఘ, మగాధ, మచింత్య, మమేయం,
ఏకాంతం, ఏకైకం,
క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం,
బ్రహ్మానుభవం కలిగించిన,
నను కరిగించిన కవనఘృణీ!
రమణీ!
కవితా! ఓ కవితా!

నా జనని గర్భంలో,
ఆకారం లేకుండా నిద్రిస్తున్న
నా అహంకారానికి
ఆకలి గొల్పించిన నాడో!
నా బహిరంత రింద్రియాలలో
ప్రాణం ప్రసరించగ,
నే నీ భూలోకంలో పడి
సుఖదుఃఖా లేవేవో
వస్తూంటే తల దాలిచి
ప్రపంచ పరిణాహంలో
ప్రయాణికుడనై,
పరివ్రాజకుడనై,
విహ్వాలంగా వర్తించేవేళ
అభయహస్త ముద్రతో నను దరిసిన,
నన్ను పునీతుని కావించిన కవితా!

లలిత లలిత కరుణామహితా!
అనుపమితా!
అపరిమితా!
కవితా! ఓ కవితా!

నేడో, నా ఊహాంచల
సాహసి కాంసం కప్పిన నా
నిట్టూర్పులు వినిపిస్తాయా?
నే నేదో విరచిస్తానని,
నా రచనలలో లోకం ప్రతిఫలించి,
నా తపస్సు ఫలించి,
నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ
నా జాతి జనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని,
నా ఆకాశాలను
లోకానికి చేరువగా,
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకునే
వెలుగుల రవ్వల జడిగా,
అందీ అందక పోయే
నీ చేలాంచలముల విసరుల
కొసగాలులతో నిర్మించిన
నా నుడి నీగుడిగా,
నా గీతం నైవేద్యంగా, హృద్యంగా,
అర్పిస్తానో
నా విసరిన రస విస్ఫుమర
కుసుమ పరాగం
ఓహో! ఓ రసధుని! మణిఖని!
జననీ! ఓ కవితా!
కవితా! కవితా! ఓ కవితా! – *1937 (?)*

# నవ కవిత

సిందూరం, రక్తచందనం,
బంధూకం, సంధ్యారాగం,
పులిచంపిన లేడినెత్తురూ,
ఎగరేసిన ఎర్రని జెండా,
రుద్రాలిక నయన జ్వాలిక,
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవకవనానికి.

ఘాటెక్కిన గంధక ధూమం,
పోటెత్తిన సప్త సముద్రాల్,
రగులుకొనే రాక్షసి బొగ్గూ,
బుగులుకొనే బుక్కాగుండా,
వికసించిన విద్యుత్తేజం.
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి.

రాబందుల రెక్కల చప్పుడు,
పొగగొట్టపు భూంకార ధ్వని,
అరణ్యమున హరీంద్ర గర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్ర విరావం,
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.

కదిలేదీ, కదిలించేదీ,
మారేదీ, మార్పించేదీ,
పాడేదీ, పాడించేదీ,
మునుముందుకు సాగించేదీ,
పెనునిద్దుర వదలించేదీ,
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ,
కావాలోయ్ నవకవనానికి.

*– 3–8–1937*

# దేశచరిత్రలు

ఏ దేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం.

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పరాహరణోద్యోగం;
నరజాతి చరిత్ర సమస్తం
రణరక్త ప్రవాహసిక్తం.

బీభత్సరస ప్రధానం,
పిశాచగణ సమవాకారం!
నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకు తినడం.

బలవంతులు దుర్బల జాతిని
బానిసలను కావించారు;
నరహంతలు ధరాధిపతులై
చరిత్రమున ప్రసిద్ధి కెక్కిరి.

రణరంగం కానిచోటు భూ
స్థలమంతా వెదకిన దొరకదు;
గతమంతా తడిసె రక్తమున,
కాకుంటే కన్నీళులతో.

చల్లారిన సంసారాలూ,
మరణించిన జన సందోహం,
అసహాయుల హాహాకారం
చరిత్రలో మూలుగుతున్నవి.

వైషమ్యం, స్వార్థపరత్వం,
కౌటిల్యం, ఈర్ష్యలు, స్పర్థలు
మాయలతో మారుపేర్లతో
చరిత్ర గతి నిరూపించినవి.

జెంఘిజ్ ఖాన్, తామర్లేనూ,
నాదిర్షా, ఘజ్నీ, ఘోరీ,
సికందరో ఎవడైతేనేం?
ఒకొక్కడూ మహాహంతకుడు.

వైకింగులు, శ్వేతహూణులూ,
సిధియన్లూ, పారశీకులూ,
పిండారులు, థగ్గులు కట్టిరి
కాలానికి కత్తుల వంతెన.

అజ్ఞానపు టంధయుగంలో,
ఆకలిలో, ఆవేశంలో –
తెలియని ఏ తీవ్రశక్తులో
నడిపిస్తే నడిచి మనుష్యులు –

అంతా తమ ప్రయోజకత్వం,
తామే భువి కధినాధులమని,
స్థాపించిన సామ్రాజ్యాలూ,
నిర్మించిన కృత్రిమ చట్టాల్

ఇతరేతర శక్తులు లేస్తే
పడిపోయెను పేక మేడలై!
పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

చిరకాలం జరిగిన మోసం,
బలవంతుల దౌర్జన్యాలూ,
ధనవంతుల పన్నాగాలూ
ఇంకానా! ఇకపై చెల్లవు.

ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తీ,
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘిక ధర్మం
ఇంకానా? ఇకపై సాగదు.

చీనాలో రిక్షావాలా,
చెక్ దేశపు గని పనిమనిషీ,
ఐర్లాండున ఓడ కళాసీ,
అణగారిన ఆర్తులందరూ –

హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో,
ఖండాంతర నానా జాతులు
చారిత్రక యథార్థతత్త్వం
చాటిస్తా రొక గొంతుకతో.

ఏ యుద్ధం ఎందుకు జరిగెనొ?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?
తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం.

ఈ రాణీ ప్రేమపురాణం,
ఆ ముట్టడికైన ఖర్చులూ,

మతలబులూ, కైఫీయతులూ
ఇవి కావోయ్ చరిత్రసారం.

ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు!
దాచేస్తే దాగని సత్యం.

నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?

సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహసమెట్టిది?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్,
అది మోసిన బోయీలెవ్వరు?

తక్షశిలా, పాటలిపుత్రం,
మధ్యధరా సముద్రతీరం,
హారప్పా, మొహెంజొదారో,
క్రో – మాన్యాన్ గుహాముఖాల్లో –

చారిత్రక విభాత సంధ్యల
మానవకథ వికాసమెట్టిది?
ఏ దేశం ఏ కాలంలో
సాధించిన దేపరమార్థం?

ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?
ఏ వెల్గుల కీ ప్రస్థానం?
ఏ స్వప్నం? ఏ దిగ్విజయం? – 10–4–1938

* * *

# జ్వాలాతోరణం

స్వర్గనరకముల ఛాయా దేహళి,
తెలి, నలి తలుపులు తెరచి, మూసికొని
సర్గ విలయ హేమంత వసంత
ధ్వాంత కాంతి విక్రాంతి వేళలో,

చావు పుట్టుకల పొలిమేరలలో
అవులించె నొక చితాగ్ని కుండం!
అనాథజీవుల సమాధులన్నీ
అఘోరించి ఘోషించాయి!

ఇదేమి! లోకం హిరణ్యనేత్రుని
పదాఘాతమున ప్రతిధ్వనించగ,
కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు
గదాఘాతమున గజగజలాడగ,

జాతి జాతి నిర్ఘాత పాత సం
ఘాత హేతువై, కాలకేతువై
అదె సంవర్తపు తుపాను మేఘం
తొలి గర్జించిన తూర్యవిరావం!

ప్రదీప్తకీలా ప్రవాళమాలా
ప్రపంచవేలా ప్రసారములలో,
మిహిరవాజితతి! మఖవ ధనుర్ద్యుతి!
పుడమికి నేడే పుట్టిన రోజట! – *1938*

* * *

# మానవుడా!

రాశి చక్రగతులలో
రాత్రిందివాల పరిణామాలలో,
బ్రహ్మాండ గోళాల పరిభ్రమణాలలో,
కల్పాంతాలకు పూర్వం కదలిక పొందిన
పరమాణువు సంకల్పంలో,
ప్రభవం పొందిన వాడా!
మానవుడా! మానవుడా!

సౌందర్యం ఆరాధించేవాడా!
కవితలో, శిల్పంలో –
పురుగులో, పుష్పంలో –
మెరుపులో, మేఘంలో
సౌందర్యం ఆరాధించే వాడా!
జీవించేవాడా!
సుఖించేవాడా! దుఃఖించేవాడా!
విహ్వలుడా! వీరుడా!
ప్రేమించేవాడా!
వియోగీ! యోగీ! భోగీ! త్యాగీ!

ఆలోచనలు పోయేవాడా!
అనునిత్యం అన్వేషించేవాడా!
చెట్టూ, చెరువూ, గట్టూ, పుట్టా
ఆకసంలో, సముద్రంలో
అన్వేషించేవాడా!

అశాంతుడా! పరాజయం ఎరుగనివాడా!
ఊర్ధ్వదృష్టీ! మహామహుడా!
మహాప్రయాణికుడా!
మానవుడా! మానవుడా!
కాట్లాడుకు నేవాడా!
ఓర్వలేనివాడా!
సంకుచిత స్వభావుడా!
అయ్యో! మానవుడా!

ఓహో! మానవుడా!
ధర్మస్థాపనకు యుద్ధంచేసేవాడా!
అన్యాయం భరించలేని వాడా!
ఆదర్శజీవీ! మహాత్మా! మానవుడా!
ఆసియా, అమెరికా, యూరప్,
ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో
సముద్ర ద్వీపాలలో,
ధ్రువ ప్రాంతాలలో
పట్టణాలలో, పల్లెలలో,
ధనివో, దరిద్రుడవో,
వృద్ధుడవో, యువకుడవో,
తెల్లని, నల్లని, ఎర్రని, పచ్చని రంగో,
బలవంతుడివో, బలహీనుడివో
బ్రదికేవాడా! పాడేవాడా!
మానవుడా! మానవుడా!
అవిభక్తకుటుంబీ!
ఏక రక్త బంధూ!
మానవుడా! మానవుడా!

అనేక భాషలు మాట్లాడేవాడా!
అనేక స్థలాలలో తిరిగేవాడా!
అనేక కాంతులు వెదజల్లేవాడా
సహృదయా! సదయా! సన్మార్గగామీ!
సముద్రాలు దాటేవాడా
ఎడారులూ, పర్వతాలూ గడచేవాడా!
ఆకాశాలను వెదికే వాడా!
నక్షత్రాలను శోధించే వాడా!
పిపాసీ! తపస్వీ!
వంతెనలు నిర్మించినవాడా!
వైద్యశాలలు, వస్తుప్రదర్శనశాలలు,
గ్రంధాగారాలు, పరిశ్రమాలయాలు,
ధూమశకటాలూ, నౌకలూ, విమానాలూ
నిర్మించినవాడా!
దూరదృష్టి, దూరశ్రవణశక్తులు
సాధించినవాడా!
మానవుడా! మానవుడా!

రసైకజీవీ!
కవీ! నటుడా! శిల్పాచార్యా!
గానకళాకోవిదుడా! వేదాంతీ!
విజ్ఞానధనీ! భావధునీ

దుఃఖమయా! దయాళూ! పరదుఃఖాసహనశీలీ!
చీమనుకూడ చంపడానికి
చేతులురాని వాడా!
బుద్ధమూర్తీ!
జీసస్!
సంఘపశూ! శ్రమైకజీవీ!

శరీర పరీవృతుడా!
ఘర్మవర్ష పయోదుడా!
రక్తకణ సమష్టి కుటుంబీ!
కష్టజీవీ! కార్మికుడా! మానవుడా
కూలీ! మాలీ! రైతూ!
గుడిసెలలో బ్రదికేవాడా!
గంజినీళ్లు తాగి కాలం గడిపేవాడా!
కడుపెడు సంతానం కలిగినవాడా!
ఆకలికన్నూ! మానవుడా!
తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా!
అన్యాయాలకు ఆహుతి కావడానికైనా
జంకని వాడా?
ఖైదీ!
రౌడీ!
ఖూనీకోర్!

మానవుడా! మానవుడా! – *1938 (?)*

# సంధ్యాసమస్యలు

ఆ సాయంత్రం.....
రాక్సీలో నార్మా షేరర్,
బ్రాడ్వేలో కాంచనమాల!
ఎటు కేగుటో సమస్య తగిలిం
దొక విద్యార్థికి!

ఉడిపీ శ్రీకృష్ణ విలాస్‌లో –
అటు చూస్తే బాదం హల్వా,
ఇటు చూస్తే సేమ్యా యిడ్లీ!
ఎంచుకొనే సమస్య కలిగిం
దొక ఉద్యోగికి!
ఆ సాయంత్రం....
ఇటు చూస్తే అప్పులవాళ్లూ
అటు చూస్తే బిడ్డల ఆకలి!
ఉరిపోసుకు చనిపోవడమో,
సముద్రమున పడిపోవడమో –
సమస్యగా ఘనీభవించిం
దొక సంసారికి! – 1939 (?)

# దేనికొరకు?

వేళకాని వేళలలో, లేనిపోని వాంఛలతో -
దారికాని దారులలో, కానరాని కాంక్షలతో -
దేనికొరకు పదే పదే దేవులాడుతావ్?
ఆకటితో, అలసటతో,
ప్రాకులాడుతావ్?
శ్రీనివాసరావ్!

శ్రీనివాసరావ్!
దేనికోసమోయ్?
నడిరాతిరి కడలి వద్ద
హోరుగాలి ఉపశ్రుతిగ,
నీలోనే నీవేదో ఆలపించుతావ్?
అవ్యక్తపు టూహలతో ఆలసించుతావ్
జగమంతా నిదుర మునిగి
సద్దణగిన నడిరాతిరి
నీలోనే నీ వేదో ఆలకించుతావ్?
శ్రీనివాసరావ్!
శ్రీనివాసరావ్! – 1939 (?)

# కేక

నిద్రకు వెలియై...
నే నొంటరినై...
నా గది లోపల చీకటిలో,
చీకటి లోపల నాగదిలో,
నా గదిలో...
చీకటిలో...

నే నొక్కడనై...
నిద్రకు వెలియై..
కన్నుల నిండిన కావిరితో!
కావిరి నిండిన కన్నులతో!
కన్నులలో...
కావిరితో...

నిద్రకు వెలియై...
నే నొక్కడనై...
గుండెల కప్పిన కుంపటితో!
కుంపటి కప్పిన గుండెలతో!
గుండెలలో...
కుంపటితో...

నా కనుగోనల,
నా యెద గోడల,
నాలుగు దిక్కుల బాకులతో...

బాకుల తోటల బాటలతో...
బాటలలో...
బాకులతో...

భగ భగ భుగ భుగ
భగ భగ మండే
నా గది చీకటి నాలుకతో!
నాలుక చీలిన నాగులతో!
నాగదిలో...
నాగులతో...
ఇరవై కోరల,
అరవై కొమ్ముల,
క్రూర ఘోర కర్కోటకులో?
కోరకి కన్నూ,
కొమ్ముకి కన్నూ,
కర్కాటక కర్కోటకులో?
దారుణ మారణ దానవ భాషలు,
ఫేరవ భైరవ భీకర ఘోషలు,
ఘోషల భాషల,
ఘంటల మంటల,
కంటక కంఠపు గణగణలో?
చిటికెల మెటికల చిటపటలో?

నే నొంటరినై...
నిద్రకు వెలియై...
చీకటి లోపల నాగదిలో,
నాగది లోపల చీకటిలో,
చీకటిలో...
ఆకటితో... – *20–6–1939*

* * *

# దలు

అంతేలే, పేదల గుండెలు!
అశ్రువులే నిండిన కుండలు!
శ్మశానమున శశికాంతులలో
చలిబారిన వెలి రాబండలు!

అంతేలే, పేదల మూపులు!
అణగార్పగ విధి త్రోద్రోపులు,
పయోధితట కుటీరములవలె
భరియించవు బాధల మోపులు!

అంతేలే, పేదల చేతులు!
శ్లథశైశిర పలాశరీతులు!
విశుష్కములు, పరిపాండురములు!
విచలించెడు విషాదహేతులు!

అంతేలే, పేదల కన్నులు!
వినమ్రములు, వెతల వ్రణమ్ములు!
తుపానులో తడిసిన, జడిసిన
గోమాతల కన్నుల తమ్ములు!

అంతేలే, పేదల బ్రతుకులు!
తిరిపెమునకు పిడికెడు మెతుకులు!
తెరువెరుగని దీర్ఘ రాత్రిలో
తల పగిలెడి తలపుల గతుకులు!

(Emile Verhaeren వ్రాసిన Les Pauvres
అనే *గీతానికి అనువాదం)* – *1939 (?)*

* * *

# గర్జించు రష్యా!

(The Soviet Air Force has gone into action
- News Item . June' 41)

గర్జించు రష్యా!
గాండ్రించు రష్యా!
పర్జన్యశంఖం పలికించు రష్యా!
దౌర్జన్యరాజ్యం ధ్వంసించు రష్యా!
లేలే, రష్యా!
రా రా, రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా!

వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్యదాతా!
పతిత నిర్గతిక ప్రపంచత్రాతా!
భావికాల స్వర్ణభవన నిర్మాతా!
లేలేలే రష్యా!
రా రా రా రష్యా!
రష్యా! రష్యా! రష్యా! రష్యా

పుష్కిన్, గోగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్,
డోస్టోయ్‌వస్కీ, గోర్కీ, కూప్రిన్
శిల్పసమ్రాట్టులై
జీవితం మథియించి,
పాప పంకం నుండి పద్మాలు పుట్టించి,
కార్మిక స్వర్గాన్ని కలగన్న రష్యా!
రష్యా! రష్యా! రష్యా! నా రష్యా!

మార్క్స్, ఎంగెల్స్ మహాప్రవక్తలై
బుఖారిన్, బకూనిన్, క్రోపోట్‌కిన్,
భావాల కోలాహలంతో
మానవ పురోగమన మార్గాలు తెరువగా
లెనిన్ తపస్సు,
స్టాలిన్ సేద్యం
జ్వలించిన, ఫలించిన సముజ్జ్వల తేజం!
యునైటెడ్ సోవియట్ సోషలిస్ట్ రాజ్యం
స్వాతంత్ర్య శత్రువుల గుండెల్లో బల్లెం!
పర పీడనాపరుల ప్రాణాల భైరవి!
రా రా రా, రష్యా
లే లే లే, రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా!

ఈ అగ్ని వర్షాలు,
ఈ రక్తపాతాలు,
ఎలాగూ వచ్చాయి, ఏమయితే కానీ!
ఈ సవన రంగంలో ఎగరనీ జీవాలు!
ఈ సమరం తుది చూడక
ఇక నిలిచి పోరాదు!
తిరుగులేని ప్రతిజ్ఞ తీసుకో రష్యా!

పెట్టుబడి కూటాలు కట్టుకడుతున్నాయి!
కుట్రలు, కుహకం చెలరేగుతున్నాయి!
అసత్య ప్రచారపు రేడియో బాకా,
రాజకీయాలలో రంకు వేషాలు,
మరఫిరంగులు తెచ్చి మందిచ్చి, రష్యా!
విమాన బాహువులు విసురుతూ, రష్యా!
అనంత ప్రపంచం అంతటా నీవై

నీ గొడుగు నీడల్ని సాగించు రష్యా!
స్వతంత్రతత, సమానత సాధించు రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా!

సుప్తకంకాళాలు మేలుకొంటున్నాయి!
ప్రపంచం పడగెత్తి బుసకొట్టి లేచింది!
కార్మికులు, కర్షకులు, తాడితులు, పీడితులు,
కెరటాలుగా పొంగి తిరగబడుతున్నారు!
ప్రపంచం నీ కోసం పరిపక్వంగా వుంది!
కోటి గొంతులు నిన్నుకోరి రమ్మన్నాయి
కోటిచేతులు నిన్ను కౌగిలిస్తున్నాయి!
సైఁ అంటూ రష్యా!
జై అంటూ రష్యా!
లే లే లే రష్యా!
రా రా రా రష్యా!
రష్యా! రష్యా! రష్యా! ఓ రష్యా! – *1941*

* * *

# నిజంగానే?

నిజంగానే నిఖిలలోకం
నిండుహర్షం వహిస్తుందా?
మానవాళికి నిజంగానే
మంచికాలం రహిస్తుందా?

నిజంగానే, నిజంగానే
నిఖిలలోకం హసిస్తుందా?
దారుణ ద్వేషాగ్ని పెంచే
దానవత్వం నశిస్తుందా?

బానిసల సంకెళ్ళు బిగిసే
పాడుకాలం లయిస్తుందా?
సాధుసత్త్వపు సోదరత్వపు
స్వాదుతత్త్వం జయిస్తుందా?

జడలు విచ్చిన, సుడులు రెచ్చిన
కడలి నృత్యం శమిస్తుందా?
నడుమ తడబడి, సడలి, ముడుగక
పడవ తీరం క్రమిస్తుందా?

నిజంగానే, నిజంగానే?

– *1941 (?)*

* * *

# నీడలు

చూడు, చూడు, నీడలు!
నీడలు, పొగ మేడలు!
యుగ యుగాల దోపిడిలో,
నరనరాల రాపిడిలో –
వగదూరిన,
పొగచూరిన
శాసనాల జాడలు!
జాలిజార్చు గోడలు!

చూడు, చూడు, నీడలు!
నీడలు, పొగ మేడలు!

☆ ☆ ☆

చూడు, చూడు, నీడలు
పేదవాళ్ళ వాడలు!

నరనరాల వేదనలో
తరతరాల రోదనలో –
బక్క చిక్కి!
బిక్కచచ్చి
పడిన బతుకు గోడలు!
పాడుపడ్డ వాడలు!
చూడు, చూడు, నీడలు!
పేదవాళ్ళ వాడలు!

చూడు, చూడు, నీడలు!
పూలు లేని కాడలు!
తరతరాల చెరసాలల
రకరకాల తెరచాటుల
పొదిగిటిలో
ఒదిగిలిపడు
నిర్భాగ్యపు నీడలు!
ఎడారిలో ఓడలు!

చూడు, చూడు, నీడలు!
పూలులేని కాడలు!

చూడు, చూడు. వ్రీడలు!
పీడలతో క్రీడలు!
చూడు, చూడు, నీడలు!
సూర్యునితో క్రీడలు!
సూర్యునిలో సూదులతో
క్రీడలాడు నీడలు!

*– 19–6–1947*

* * *

# జగన్నాథుని రథచక్రాలు

పతితులార!
భ్రష్టులార
బాధాసర్ప దష్టులార!
బ్రదుకు కాలి,
పనికిమాలి,
శని దేవత రథచక్రపు
టిరుసులలో పడి నలిగిన
దీనులార!
హీనులార!
కూడు లేని, గూడు లేని
పక్షులార! భిక్షులార!
సఖులవలన పరిచ్యుతులు,
జనులవలన తిరస్కృతులు,
సంఘానికి బహిష్కృతులు
జితాసువులు,
చ్యుతాశయులు,
హృతాశ్రయులు,
హతాశులై
ఏడవకం డేడవకండి!
మీ రక్తం, కలగి కలగి
మీ నాడులు కదలి కదలి
మీ ప్రేవులు కనలి కనలి
ఏడవకం డేడవకండి!

ఓ వ్యధా నివిష్టులార!
ఓ కధా వశిష్టులార!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
ఏడవకం డేడవకండి!

వస్తున్నా యొస్తున్నాయి...
జగన్నాధ,
జగన్నాధ,
జగన్నాధ రధచక్రాల్!
జగన్నాధుని రధచక్రాల్!
రధచక్రాల్,
రధచక్రాల్,
రధచక్రాల్, రధచక్రా
లొస్తున్నా యొస్తున్నాయి!

పతితులార!
భ్రష్టులార!
మొయిల్దారిని
బయల్దేరిన
రధచక్రాల్, రధచక్రా
లొస్తున్నా యొస్తున్నాయి!

సింహాచలం కదిలింది,
హిమాలయం కరిగింది,
వింధ్యాచలం పగిలింది –
సింహాచలం,
హిమాచలం,

వింధ్యాచలం, సంధ్యాచలం....
మహోన్నగా లెగురుతున్నాయి!
మహోరథం కదులుతున్నాది!
చూర్ణమాన
ఘూర్ణమాన
దీర్ణమాన గిరిశిఖరాల్
గిర గిర గిర తిరుగుతున్నాయి!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
రారండో! రండో! రండి!

ఊరవతల నీరింకిన
చెరువుపక్క, చెట్టునీడ –
గోనెలతో, కుండలతో,
ఎటుచూస్తే అటు చీకటి,
అటు దుఃఖం, పటునిరాశ –
చెరసాలలు, ఉరికొయ్యలు,
కాలువలో ఆత్మహత్య!
దగాపడిన తమ్ములార!
మీ బాధలు నే నెరుగుదును...
వడలో, కడు
జడిలో, పెను
చలిలో తెగనవసి కుములు
మీ బాధలు, మీ గాథలు
అవగాహన నాకవుతాయి
పతితులార!
భ్రష్టులార!
దగాపడిన తమ్ములార!

మీ కోసం కలం పట్టి,
ఆకాశపు దారులంట
అడావుడిగ వెళిపోయే,
అరచుకుంటు వెళిపోయే
జగన్నాథుని రథచక్రాల్,
రథచక్ర ప్రళయఘోష
భూమార్గం పట్టిస్తాను!
భూకంపం పుట్టిస్తాను!

నట ధూర్జటి
నిటాలాక్షి పగిలిందట!
నిటాలాగ్ని రగిలిందట!
నిటాలాగ్ని!
నిటాలార్చి!
నిటాలాక్షి పటాలుమని
ప్రపంచాన్ని భయపెట్టింది!

అరె ఝూః! ఝూః!
ఝటక్, ఫటక్.....

హింసనచణ
ధ్వంసరచన
ధ్వంసనచణ
హింస రచన!
విషవాయువు, మర ఫిరంగి,
టార్పీడో, టోర్నాడో!
అది విలయం,
అది సమరం,
అటో యిటో తెగిపోతుంది?

సంరంభం,
సంక్షోభం,
సమ్మర్దన, సంఘర్షణ!
హాలాహలం పొగచూరింది!
కోలాహలం చెలరేగింది
పతితులార!
భ్రష్టులార!
ఇది సవనం,
ఇది సమరం!
ఈ యెగిరిన ఇనుప డేగ,
ఈ పండిన మంట పంట–
ద్రోహాలను తూలగొట్టి,
దోషాలను తుడిచి పెట్టి,
స్వాతంత్ర్యం,
సమభావం,
సౌభ్రాత్రం,
సౌహార్దం
పునాదులై ఇళ్ళు లేచి,
జనావళికి శుభం పూచి –
శాంతి, శాంతి, కాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది,
ఈ స్వప్నం నిజమవుతుంది!
ఈ స్వర్గం ఋజువవుతుంది!
పతితులార!
భ్రష్టులార!
బాధాసర్పదష్టులార!
దగాపడిన తమ్ములార!
ఏడవకం డేడవకండి!

వచ్చేశాయ్, విచ్చేశాయ్,
జగన్నాథ,
జగన్నాథ,
జగన్నాథ రథచక్రాల్,
జగన్నాథుని రథచక్రాల్,
రథచక్రాల్,
రథచక్రాల్,
రథచక్రాల్, రథచక్రాల్,
రారండో! రండో! రండి!
ఈ లోకం మీదేనండి!
మీ రాజ్యం మీరేలండి!

*– 1940*

* * *

# శ్రీశ్రీ గురించి...

♦ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి♦

శ్రీశ్రీలో సంప్రదాయ సాహిత్యం, సాహిత్య సిద్ధాంతాల జ్ఞానం ఉంది వైదుష్యం ఉంది. జాతీయ, అంతర్జాతీయ సాహిత్యాల, సాహిత్య చలనాల, ఉద్యమాల, ధోరణుల పరిచయమూ, అవగాహనా ఉన్నాయి. శ్రీశ్రీ సృజన, ప్రతిభ, తాత్త్విక మార్గాన్వేషణతో కూడిన నిరంతర ప్రయోగశాల

కవిత్వ మాధ్యమం మీద శ్రీశ్రీకున్న అదుపు – పద్యం, గేయం, వచన పద్యం, పాట, శతకం, ప్రాసక్రీడ, లిమరిక్, కవితా సంభాషణ కవితా రూపాలమీద అదుపు – కవితా ప్రియులందర్నీ చకితుల్ని చేసింది 'ప్రపంచం అంతటా వచ్చినటువంటి ఉల్లోలకల్లోల ప్రభావం'తో 'దందహ్యమానంగా మండిపోతున్న దశాబ్దం'లో మహాప్రస్థానం గీతాలు వచ్చాయి వాటిలోని 'మార్క్సిస్టు స్ఫూర్తి, సామాజిక స్పృహ యాదృచ్ఛికాలు కావని' శ్రీశ్రీ తనమాటగా చెప్పారు అప్పటినుంచీ, అంటే 1933లో రాసిన జయభేరి గీతం నుంచీ 1983లో మరణించే వరకూ అలజడికీ, ఆందోళనకూ గురైన తిరుగుబాటు యువపాఠకుల్నీ, సామాజిక పరివర్తన' 'అభ్యుదయం' కోసం క్రియాశీలంగా కదలిన పాఠకశ్రోతృ సముదాయాల్నీ శ్రీశ్రీ ఉత్తేజపరిచారు ఇరవయ్యో శతాబ్దిలో ఒక అర్ధశతాబ్ది కాలం సాహితీ ప్రజారంగాల్లో శ్రీశ్రీ – కదలికకు సంకేతంగా నిలిచారు. సాహిత్యంలో 'క్లాసిసిజం,' జాతీయ దురహంకార ధోరణులను వ్యతిరేకించారు అభ్యుదయ కవితా వైతాళికుడిగా, విప్లవకవితా చోదకుడుగా గుర్తింపు పొందారు

కవిత్వంలోనే కాకుండా కథ, నవల, నాటకం శ్రవ్యనాటిక, ప్రత్యేక వ్యాసం (ఫీచర్), విమర్శ, యాత్రాచరిత్ర, ఆత్మకథ, లేఖాసాహిత్యం ప్రక్రియల్లో సైతం తనదైన ముద్రను ప్రతిఫలించటానికి ప్రయత్నించారు. సృజనాత్మక రచనల అనువాదంలో అనుసృజనకు దృష్టాంతంగా నిలిచారు.

కథారచనలో చైతన్య స్రవంతి ధోరణి ప్రవేశానికి స్ఫూర్తి నిచ్చారు శ్రవ్యనాటికల్లో మానవుని భవితవ్యాన్ని గురించి కలలు గన్నారు. విమర్శలో 'రసానందం' 'రసావిష్కరణ' 'రసాస్వాదన' 'రసస్పందన' 'రీతి' లాంటి ఆలంకారిక సంప్రదాయ పరిభాషను వాడారు 'రసన' అనే 'ఏకకాలంలో అనే రసాలు ఉప్పొంగ చేసే' రచనాపద్ధతిని ప్రతిపాదించారు. ఆత్మకథ అనంతంలో వ్యక్తిగత బలహీనతల్ని బహిరంగంగా చెప్పుకునే ఒక కొత్త పద్ధతిని ప్రవేశపెట్టారు. (పాశ్చాత్య ఆత్మకథల Openness ప్రభావమూ, కొంతవరకు పాబ్లోనెరూడా ఆత్మకథ ప్రభావమూ అనంతం మీద ఉండి ఉండాలి). రచనా సందర్భాన్నీ రచనను బట్టి మార్క్సిజం, ఫ్రాయిడిజంలోని భౌతిక మానసిక ప్రపంచాల సంబంధాన్ని, లోతుల్నీ పట్టుకోడానికి ప్రయత్నించారు. తన జీవితకాలంలోనే అభిమానులనూ, అనుకర్తలనూ, ముగ్ధులనూ, ఆరాధకులనూ, వీరభక్తులను, డ్రాయింగ్‌రూం కవిత్వకళా ప్రదర్శకులనూ సంపాదించుకున్నారు.

తెలుగు సాహిత్యరంగంలో శ్రీశ్రీ ఒక అద్భుతవ్యక్తి (Legend) గా ఒక సమ్మోహనశక్తి (Charishma)గా కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకున్నారు ఒక గూఢ ప్రశ్న (enigma) గా కూడా నిలిచారు

ఇరవయ్యోశతాబ్ది చివరి రెండు దశాబ్దాల్లో శ్రీశ్రీ జీవిత సాహిత్యాలగురించీ, సమాజం శ్రీశ్రీ జీవిత సాహిత్యాలమధ్య ఉండే అన్యోన్య సంబంధాల గురించీ మునుపటికంటే నిశితంగా విమర్శకులు పునర్మూల్యాంకనానికి పూనుకున్నారు. ఈ పునర్మూల్యాంకనానికి దోహదం చేసిన కారణాలు కొన్ని : 1 మారిన రాజకీయ సామాజిక సాంస్కృతిక సన్నివేశాలు, 2 భిన్న ప్రాంతీయ, సామాజికవర్గాలనుంచీ విద్యాధికులు, రచయితలు, విమర్శకులు రావటం, 3 రచనా సందర్భంలో, పాఠకశ్రోతృ, ప్రేక్షక సంబంధాల్లో వచ్చిన మార్పులు, 4. రచనా పద్ధతుల్లో వచ్చిన మార్పులు, 5 ప్రపంచీకరణ, సంస్కృతీకరణ, విసంస్కృతీకరణ ప్రభావాలవల్ల తలెత్తిన కొత్తభావనలూ, సాహిత్యధోరణులు, 6 శ్రీశ్రీ రచనలు దాదాపు సమగ్రంగా అందుబాటులో ఉండటం, 7 చర్చలను ప్రోత్సహించే పత్రికల్లో స్థలందొరికే అవకాశాలుండటం – వీటిమూలంగా కొన్ని చిల్లర చర్చలూ జరిగాయి మరికొన్ని విశ్లేషణలూ జరిగాయి

చిల్లర చర్చల్లో ముఖ్యమైన చర్చ యుగకవి/ యుగకర్త ఎవరనే విషయం. ఇదొక పీకులాట వ్యవహారం, కాకపోతే పీచుమిఠాయి సాగతీత కొన్ని లక్షల మానుష సంవత్సరాలను యుగం మహాయుగం, బ్రహ్మకల్పం, పద్మకల్పం, వరాహకల్పం ప్రమాణాలుగా భావించే దేశంలో ఇంగ్లీషు సాహిత్యంలోని (epoch, epoch, maker) సంప్రదాయాన్ని అనుసరించటం, తెలుగు సాహిత్యానికి అన్వయించుకోవటం విడ్డూరం మరొక విడ్డూరం రాజులూ, రాజవంశాలూ, కవులూ మాత్రమే యుగవిభజనలో ముఖ్యులు అనుకోవటం ఈ సందర్భంగా కె వి రమణారెడ్డి అభిప్రాయాన్ని ఉటంకించుకోవచ్చు. "కవిత్వానికి మనదేశంలో ఉన్న ఆకర్షణ, నిజం ఆలోచిస్తే, సంఘం వెనుకబాటుతనానికే దాఖలా. వచనం గద్దెమీద 'ఉండవలసిన నేటి' 'ప్రజాస్వామిక' యుగంలోనూ ఈ 'ఆదిమ' యుగ అవశేషం సుదూరగతం యింకా మనమీద భూతంలా కాకుండా, సన్నిహిత భావబంధువులా పెత్తనం సాగించుకుంటోంది " (ఆధునికయుగంలో కవిలోకం పేజీ 89,90) సాహిత్యంలోని ఒక చారిత్రక దశను మలుపు తిప్పిన స్ఫూర్తిమంతమైన సృజనాత్మక రచనను ప్రమాణ గ్రంథంగా, దాని రచయితను ప్రమాణ రచయితగా గుర్తించడం సాహిత్యంలో నాగరిక లక్షణం.

శ్రీశ్రీ రచనల విశ్లేషణాపూర్వక పునర్మూల్యాంకనంలో కొన్ని వాదాలు ప్రత్యక్షంగానో, గోప్యంగానో కన్పిస్తాయి. అవి. 1. శ్రీశ్రీ జీవితంలోని అసంబద్ధతా, అస్తిత్వ విచికిత్సా, క్రోపొట్కిన్ (1842 – 1921) తరహా అరాచక ఆదర్శకాంక్షా శ్రీశ్రీ రచనల్లో ప్రతిఫలిస్తున్నాయి. 2. శ్రీశ్రీకి మార్క్సిజం తెలియదు. 3. శ్రీశ్రీలో సంప్రదాయధోరణి బలంగా ఉంది. అది బ్రాహ్మణవాదధోరణి. 4. భాషల్లో, భావనల్లో, ఛందస్సులో గురజాడతో పోలిస్తే శ్రీశ్రీ ఆధునికుడు కాడు (బూదరాజు రాధాకృష్ణ, మహాకవి శ్రీశ్రీ పేజీ, 87) 5. లిఖిత సంప్రదాయంలోకి చేరిన పరిమితి మౌలిక లక్షణానికేగాని, మౌఖిక సంప్రదాయంలోని సారళ్యానికీ, నిసర్గవేగానికీ, పునరుత్పత్తికీ శ్రీశ్రీ కవిత్వం దృష్టాంతం కాదు (గరిమెళ్ల మాకొద్దీ తెల్లదొరతము (1921) లాగా, గద్దర్ పాటల్లాగా. శివసాగర్ కొన్ని గీతాల్లాగా) నిరక్షరాస్యులు

ఎక్కువగా, అక్షరాస్యులు తక్కువగా ఉంటున్న సమాజంలో గిరిజన సంస్కృతి సజీవంగా ఉంటున్న సమాజంలో శ్రీశ్రీ కవిత్వం ఎక్కువ మందిని చేరలేదు 1972లో రా రా శ్రీశ్రీ 'తాత్త్విక చిత్తవృత్తి'ని గురించి వేకువ పత్రికలో ఒక వ్యాసం రాశారు కొన్ని రచనల్లో మాత్రమే వ్యక్తమయ్యే ఈ తాత్త్విక చిత్తవృత్తిని దృష్టాంతాలు చూపుతూ చర్చించారు శ్రీశ్రీలోని 'అంతులేని అసంతృప్తి, 'అనంతమైన ఒంటరితనమూ' 'అవ్యాజమైన పరివేదనా' 'నిరుపశమనంగా ఉండే దుఃఖమూ ఏలాంటివో తెలిపారు 'మానవుడా' అనే గేయంలోని 'శరీరపరీవృతుడా' అన్న శ్రీశ్రీ ప్రయోగంలోని అంతరార్థాన్ని రా రా. పట్టుకోడానికి ప్రయత్నించారు "తాను శరీరం కంటే భిన్నమనే ఒక భావాన్ని మానవునికి అనుభవం చేసే తాత్త్విక చిత్తవృత్తిని శ్రీశ్రీ సూచిస్తున్నాడని చెప్పవచ్చు" అని రా రా అభిప్రాయపడ్డారు.

## శ్రీశ్రీ మార్క్సిజం అవగాహన గురించి

ఆర్థిక మాంద్యం (1929 –34), స్పెయిన్ అంతర్యుద్ధం (1936-39) కాలంలో గొప్ప రచనలు చేసిన అడెన్, స్పెండర్, డేలూయిస్, దిలాన్‌థామస్, జార్జిబార్కర్, ఆకాలంలోనే ఇంగ్లాండు నుంచి వెలువడిన ఇండియన్ ప్రోగ్రెసివ్‌రైటర్స్ మానిఫెస్టో - "ఇన్ని యిన్ని ప్రవాహాలమధ్య" "తన ' మహాప్రస్థాన గీతాలు కూడా ప్రవహించాయి'[1] అని శ్రీశ్రీ చెప్పుకున్నారు "ఈ వాస్తవాలన్నింటికీ నేను స్పందించినా, ఇలాంటి రచనలను 'సామాజిక వాస్తవికత' అంటారనీ దీనివెనుక దన్నుగా 'మార్క్సిజం' అనే దార్శనికత ఒకటి ఉందని అప్పటికీ నాకు తెలియదు" అని శ్రీశ్రీ తెల్పారు (మహాప్రస్థానం నామాట. శ్రీశ్రీ ప్రచురణలు మే 1990 - సొంతదస్తూరీలో) అప్పటికీ శ్రీశ్రీ మార్క్సిజానికి సంబంధించిన ప్రమాణ గ్రంధాల నుంచి ఉత్తేజం పొందలేదు. ఆ తర్వాత కూడా దాదాపు అదే స్థితి ఆయన ప్రధానంగా స్ఫూర్తి పొందింది, జాతీయ, అంతర్జాతీయ సాహిత్యం నుంచీ, ఆ ఉద్యమాలనుంచీ ఈ స్ఫూర్తితోనే సాహిత్యంలోంచీ, సాహిత్యోద్యమాలకు నేతృత్వం వహించారు. ఫ్రెంచి, జర్మన్, చెక్, పోలిష్ ఇంగ్లీష్ అమెరికన్, స్పానిష్, రష్యన్, చైనీస్ సాహిత్యాలను ఆయన చదివారు శ్రీశ్రీ సాహిత్య సృజన విస్తారమైన సాహిత్యాధ్యయనానికీ, సాహిత్య మధనానికీ, జీవితానుభవాల విశ్లేషణకూ, ప్రపంచంలోని పీడిత మానవ ఘోషలకూ సంబంధించింది. శ్రీశ్రీ మార్క్సిజం నుంచీ మావోయిజందాకా, నక్సలిజం దాకా చేసిన ప్రయాణం సమగ్ర సిద్ధాంత అవగాహనతో ముడిపడింది కాదు సాహిత్య విమర్శలో ఆయన ప్రస్తావించిన (thesis, antithesis, Synthasis' dialectic materialist technique') (వేమన పద్యాల్లోని నిర్మాణ శిల్పాన్ని గురించి) అనే శాస్త్ర పరిభాషాపదాలు శాస్త్రప్రమాణానికి నిలిచేవి కావని చేరా నిరూపించారు. ('విమర్శకుడిగా శ్రీశ్రీ' సాహిత్య వ్యాస రింఛోళి పేజీలో 150, 151) నిజానికి Thesis, antithesis, synthesis అనే మాటలు జర్మన్ భావవాది ఫిచే (1762-1814) ప్రతిపాదించినవి ఈ పద్ధతిలో భావవాద గతితార్కిక లక్షణాలు కొన్ని ఉన్నాయి

సామ్యవాద వాస్తవికత అనే మాటను కూడా ఆయన సోవియెట్ సాహిత్యం నుంచి గ్రహించిన మాటే తప్ప, సిద్ధాంత భూమిక నుంచి వివేచించిన మాటకాదు – జార్జిలూకాస్‌లాగా శ్రీశ్రీ ఎన్నెన్నో ప్రవాహాల మధ్య మార్క్సిజం బీజలక్షణాలను తన రచనల్లో ప్రవహింప చేశారు.

సృజనాత్మక వచన సాహిత్యంలో కొండవటిగంటి కుటుంబరావు కున్నంత మార్క్సిజం అవగాహన శ్రీశ్రీకి ఉందని చెప్పలేము

## శ్రీశ్రీలోని సంప్రదాయధోరణి బ్రాహ్మణవాదాంశాలు

ప్రాంతం, వర్గం, కులం, లింగం, వృత్తి, విద్యాస్థాయిలు భాష జీవితానుభవాలమీద ప్రభావాన్ని చూపుతాయి సామాజిక వాతావరణం నుండీ ఏర్పడే ఈ జీవితానుభవాలు రచయిత రచనా వ్యక్తిత్వంలో భాగమవుతాయి శ్రీశ్రీలోని శ్రీరంగం శ్రీనివాసరావుని పరిశీలిస్తే అతనిలోని వర్గ కుల పరిమితి అర్థమవుతుంది (శివసాగర్ విరసం మరణించింది!! దళిత వాదవివాదాలు పేజీ (104) "శ్రీశ్రీ సాహిత్య వ్యక్తిత్వంలో శ్రీశ్రీ అభివ్యక్తి కూడా ఒక భాగం అతని ప్రతీకల నిండా పదబంధాల నిండా బ్రాహ్మణులకు మాత్రమే సుసాధ్యమైన పరిభాష సంస్కృతీ కనబడుతుంది (బి యస్ రాములు ఇదే పుస్తకంలో పేజి 79) ఒకే కులానికి చెందిన విశ్వనాధ, శ్రీశ్రీల సాహిత్య దృక్పధాల మధ్య తేడాలు ఎందుకు వచ్చినట్లు? decaste (డికాస్ట్) కావటం జరగనే జరగదా? ఏమైనా సాహిత్య విమర్శ పరంగా మార్క్సిజం - ఫూలే - అంబేద్కరిజం విశ్లేషణ మూల్యాంకన పద్ధతులు ఇంకా అభివృద్ధి కావలసింది

## గురజాడతో పోలిస్తే శ్రీశ్రీ

గురజాడ లిఖిత సంప్రదాయానికి సంబంధించిన కవీ, రచయితే అయినా, మౌఖిక సంప్రదాయంలోని సారళ్యాన్ని - భాషా సారళ్యాన్ని సాధించినవాడు శ్రీశ్రీ శబ్ద సంయోజనమూ, సమాసఘటనా, పదచిత్రాలూ, భావ శబలతా దేశి సంప్రదాయానికి సంబంధించినవి కావు. ఒకరకంగా మార్గ సంప్రదాయమార్గంలో నడిచినవి మరో ప్రస్థానంలో శ్రీశ్రీ సారళ్యాన్ని సాధించారు. నిజమే. గురజాడ అడుగుజాడలో నడిచానని శ్రీశ్రీ స్వయంగా చెప్పుకున్నా గురజాడ, గరిమెళ్ల, కవికొండల, చింతాదీక్షితులు వంటి వారి రచనల్లోని మాట్లాడే భాషకు దగ్గరైన శైలి శ్రీశ్రీలో కన్పించదు. అప్రమత్తతను పోగొట్టి చైతన్య స్ఫూర్తినీ, కార్యోత్సాహాన్ని కల్గించే భాషా నిర్మాణాలను ఆయన మహాప్రస్థానంలో వాడుకున్నారు. మలయమారుత సదృశమైన భావకవితా శైలిని వదలి, ఝంఝానిల షడ్జధ్వానం పొగగొట్టపు భూంకార ధ్వనులు ప్రతిధ్వనించే మహోద్వేగ శైలిని శ్రీశ్రీ వాడుకున్నారు. సాహిత్యంలో గురజాడ విప్లవనేతృత్వాన్ని శ్రీశ్రీ నిరూపించారు. గురజాడలోని మేధాశక్తి జీవితంలోని అనేక రంగాల్ని స్పృశించగలిగే, ప్రశ్నించగలిగే వైజ్ఞానిక దృష్టీ, ఆధునిక సంస్కారమూ శ్రీశ్రీలో తక్కువే కానీ శ్రీశ్రీ సాధించిన అభ్యుదయ వాస్తవికత, గురజాడ సాధించిన దానికంటే ఊర్ధ్వచలన స్వభావం కలది శ్రీశ్రీ జీవితసాహిత్యాల విశ్లేషణ, మూల్యాంకనం, శ్రీశ్రీ ప్రయోగశీలత ఆయన రచనల్లోని ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయ ధోరణులు ఆయన దృష్టిలోని అంతర్జాతీయత, దేశీయత, రాష్ట్రీయత ఆశించిన అయన మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం పరిమితులు సర్రియలిజంతో సహా వివిధ రచనా ధోరణులమీద ఆయనమమకారం భాషా నిర్ధారణులలోని శైలిలోని urbanity వీటిలోని వైరుధ్యాలను మరింత లోతుగా అధ్యయనం చేయవలసి రావచ్చు అందుకే శ్రీశ్రీ గూఢప్రశ్నగా మిగిలారని అనటం పునర్మూల్యాంకనంలో ఈ గూఢ ప్రశ్న ఛేదింపక తప్పదు

# లఘు వివరణలు

◆డాక్టర్ ద్వా.నా.శాస్త్రి ◆

"మాటలకు సొంతవిలువలేదు వాటిని పేర్చినపుడు కొంతవిలువ వస్తుంది" అన్నాడు శ్రీశ్రీ ప్రతీకవాదం, సంస్కృతపదబాహుళ్యం, అధివాస్తవికత, నూత్న ప్రయోగత్వం వంటి కారణాలవల్ల శ్రీశ్రీ కవితల్ని పూర్తిగా అర్థంచేసుకోవడం కష్టమే చాలామంది కొంత ప్రయత్నం చేశారు డాక్టర్ మిరియాల రామకృష్ణ "శ్రీశ్రీ కవిత్వం! వస్తువు, సంవిధానం" అనే సిద్ధాంతవ్యాసంలో పదాలకు, పదబంధాలకు చాలామటుకు సముచితంగా వివరణ ఇచ్చారు శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని బాగా అర్థంచేసుకోవడానికి ఈ పుస్తకం బాగా తోడ్పడుతుంది "1933 నుంచి 1947 వరకూ రచించిన గీతాలలో నుంచి ప్రత్యేకలక్ష్యంతో 41 గీతాలను మాత్రం ఏర్చికూర్చి ముద్రించిన ఖండకావ్య సంపుటియే మహాప్రస్థానం మహాప్రస్థానంలో శ్రీశ్రీ సర్వతంత్రస్వతంత్రుడు పాశ్చాత్య సాహిత్య సముద్రావగాహనం చేసివచ్చిన శ్రీశ్రీ మహాప్రస్థానంలో కనిపిస్తాడు శ్రీశ్రీ కవిత వర్తమాన కాలంలో పొటమరించి భవిష్యత్తులోకి ఎదుగుతూపోయే లక్షణంగలది" - మి రా.

## మహాప్రస్థానం

ఇది జాతిని ముందుకు నడిపించే సమరగీతి మరోప్రపంచం అంటే సామ్యవాద ప్రపంచం ప్రస్థానం అంటే ప్రయాణం ఈ అసమ సమాజంనుంచి, ఈ దోపిడీ వ్యవస్థనుంచి, ఈ పెట్టుబడిదారీ పెత్తనం నుంచి సమ సమాజం వైపు, వర్గరహిత దోపిడీ రహిత వ్యవస్థవైపు, కార్మిక శ్రామిక కల్యాణంవైపు, సామ్యవాద వ్యవస్థ వైపుచేసే గొప్ప ప్రయాణం మహాప్రస్థానం.

వర్షుకాభ్రముల - వర్షించేమేఘాలు

త్రేతాగ్ని - గార్హపత్యం, దక్షిణాగ్ని, ఆహవనీయం అని అగ్ని మూడు రకాలు

కాసారం - సరస్సు

శివసముద్రం - కర్ణాటక లోని కావేరినది జలపాతం

నయాగరా - ప్రపంచ ప్రసిద్ధికెక్కిన జలపాతం. అమెరికాలోవుంది

రేచులు - రేచుకుక్కలు

ధనంజయుడు - అర్జునుడు

అగ్నికిరీటం - పారిశ్రామిక విప్లవం సూచిస్తుంది

ఎర్రబావుటా - కమ్యూనిజం, మార్క్సిజం

హోమజ్వాలలు - పవిత్రత, దహించివేయటం

అనలవేదిక - అగ్నివేదిక (యజ్ఞవేదిక)

అస్రు - రక్తం

భవభూతి – సంస్కృతకవి 'ఉత్తర రామచరిత్ర' రాసి కరుణరసానికి ప్రాధాన్యం ఇచ్చినవాడు

పరమేష్ఠి – బ్రహ్మ

చాంపేయమాల – సంపెంగదండ

ఊళ – కేక (పిలుపు, ధ్వని) నక్కల అరుపుల్ని ఊళలు అంటారు

కేదారగౌళ – కరుణరసాత్మకమైన, నిండైన రక్తిగల రాగం

ఝరులు – సెలయేళ్ళు

## జయభేరి

వాడుకభాషకి ప్రాధాన్యమిచ్చి ముత్యాల సరంలో రాసింది 'నేను'అంటే కష్టజీవి, శ్రామికుడు, చరిత్రకెక్కని కష్టజీవి.

ఆహుతి – అగ్నిలో వెయ్యటం

విశ్వవృష్టి – విశ్వవర్షం

సోన – అల్పవర్షం, ప్రవాహం

భుగ్నం – విరుగుట (నాశనం)

నిశీథి – రాత్రి

విశీర్ణం – శుష్కించిన (వదిలిన)

కుహూరుత – కోకిల ధ్వని

## అవతారం

ఇందులో అభ్యుదయ కవిత్వలక్షణాలలో ఒకటైన 'తిరుగుబాటు' ను సూచించాడు పెట్టుబడిదారీ వ్యవస్థపై, పెత్తందారీ వ్యవస్థపై శ్రామికులు తిరుగుబాటు చెయ్యడాన్ని ప్రతీకాత్మకంగా చెప్పాడు

మహిషం – దున్నపోతు

జాగిలం – కుక్క

సప్తహయములు – ఏడుగుర్రాలు (సూర్యుని రథాన్ని లాగుతూవుంటాయి)

సూకరం – పంది

ఘుర్ఘు రిస్తూ – ముక్కుతో ఘర్ ఘర్ అని ధ్వని చేస్తూ.

## జ్వాలాతోరణం

ధ్వాంతం – చీకటి

ఘాతము – దెబ్బ

సంవర్తము – ప్రళయం

తూర్యారావం – వాద్యనాదం

మిహిరుడు – సూర్యుడు

వాజి - గుర్రం
ద్యుతి - కాంతి

## నవకవిత

అభ్యుదయ కవిత్వ లక్షణాల్ని ఇందులో చెప్పాడు అన్నీ ప్రతీకలే ఉదాహరణకి
సిందూరం - కార్యదీక్షకి
రక్తచందనం - త్యాగానికి
బందూకం - విప్లవానికి
సంధ్యారాగం - సంఘర్షణకి
పులిచంపినలేడినెత్తురు - ధనికస్వామ్యపు దౌర్జన్యానికి గుర్తు
ఎగరేసిన ఎర్రని జెండా - కార్మిక ఉద్యమానికి సంకేతం
రుద్రాలిక నయన జ్వాలిక - శివుడి మూడో కంటి మంట-సామ్రాజ్యవాదాల రక్త దాహానికి సంకేతం
కలకత్తా కాళిక నాలుక - కలకత్తా నగరంలోని దుర్గనాలుక - వినాశానికి దుష్ట సంహారోత్సవానికి సంకేతం

## సాహసి

మితవాదుల్ని వేళాకోళంచేసే ఖండిక
సుప్త భుజంగాలు - నిద్రిస్తున్న పాములు
మస్తిష్కకులాయం - మెదడు గూడు
మనోవల్మీకం - మనస్సు అనేపుట్ట (కొత్తపదం)
మంత్ర నగరి - రహస్య సమావేశాలు జరిగే సంకేత స్థలం

## కవితా, ఓ కవితా!

ఇందులో కవిత్వదర్శనం వుంది శ్రీశ్రీ తన కవితా లక్ష్యాలను, సామాజికతను ప్రతీకలతో, సమాసాలతో వివరించాడు ఇందులో సామాజిక స్పృహ, కవితా విప్లవ స్పృహ వుంది. గతంపై నిరసనవుంది కవితాలక్షణాలు చెప్పాడు. కాల్పనికత కూడా అవసరమన్నాడు అభ్యుదయ భావాలూ ఉన్నాయి.

చిరదీక్షాశిక్షాతపస్సమీక్షణ - నిశ్చల సమాధిలోకి వెళ్ళి చూసినవి, భావించినవి చెప్తున్నాడు

అగ్ని సరస్సున వికసించిన వజ్రం - శ్రమ వల్ల వెలువడిన అమూల్య సంపద
అగ్ని-తీక్ష్ణత, సరస్సు - స్వేదం, వజ్రం-అమూల్యసంపద
ఎగరేలోహశ్యేనం-శ్యేనం అంటే డేగ లోహం దృఢత్వానికి, శ్యేనం వేగానికి చిహ్నాలు.

ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం- బూర్జువాలు తమ రక్షణకై మారణాయుధాలు సృష్టించి వినాశానికి కారకులవటాన్ని సూచించాడని తెలుస్తోంది

కడుపు దహించుకుపోయే- వేశ్యావృత్తిలోని దైన్యాన్నీ, వేదననూ వివరిస్తున్నాడు

ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం- దుర్మార్గానికి దోపిడీకి గురి అయిన రహస్యం దాన్ని ఉరితీశారు(చంపేశారు)

సినీవాలి - అమావాస్యనాటి చంద్రరేఖ (రవ్వంత వివేకంగల అజ్ఞానంగా )

ఘూకం - గుడ్లగూబ

భేకం - కప్ప

రస విస్ఫుమర కుసుమపరాగం - విస్ఫుమర అంటే ప్రసరించుట తన కవిత రసాత్మకంగా ఉండాలనటం

హల్లీసకం - వలయాకారంలో చేసే నృత్యం

కులాయం - గూడు

రోచి - కాంతి కిరణాలు

నివహం - సమూహం

పరిణాహం - వెడల్పు, వైశాల్యం

వితర్ది - వేదిక

ఆవర్తాలు - సుడులు

ధ్వానం - ధ్వని

ఈ ఖండికలో శ్రీశ్రీ నిఘంటు సంస్కరణనీ, వ్యాకరణ సంస్కరణనీ, ఛందో సంస్కరణనీ ఆశించాడనీ, ఇంద్రియ సాక్షాత్కార చిత్రణ వుందనీ, వాక్యలయ, నవ్యపదబంధ రచనతో కవిత్వ దర్శనం చేశాడనీ అంటారు

## ప్రతిజ్ఞ

ఈ ఖండిక అభ్యుదయ కవిత్వానికి మానిఫెస్టో వంటిది తెలుగు కవిత్వాన్ని వాస్తవికతవైపు పయనింపజేశాడు అనడానికి ఈ ఖండిక నిదర్శనం

ఇలాతలం - భూమి

ఘర్మజలం - చెమట

ధర్మజలం - న్యాయంగా శ్రమించటం

వరాల - వరహాలు (నాణెం)

వనిలో - అడవిలో

పరిక్లమిస్తూ - అలసిపోతూ

పరిప్లవిస్తూ - నిమగ్నమవుతూ

విలాపం - దుఃఖం

షరాబు - బంగారం మొదలైన వస్తువులకు నిక్కచ్చిగా బాగా విలువకట్టే వ్యాపారి

జని - జన్మ

నిష్ఠురమై - నిందతో కూడుకొన్నదై (అమంగళమై)

సమర్చనంగా - మంచిపూజగా(సేవించటం)
స్వస్తివాక్యములు - వేదంలోని మంగళవాక్యాలు
సంధానిస్తూ - కూరుస్తూ
సంరావిస్తూ - మోగిస్తూ
చవులు - రుచులు
విరుతించే - ధ్వనించే
ప్రణవం - ఓంకారం (సృష్టికిమూలం)

## భిక్షువర్షీయసి

శ్రీశ్రీ చెప్పిన వ్యధార్త జీవిత యధార్థ దృశ్యానికి ఈ ఖండిక నిలువుటద్దం జీవన వాస్తవికతను వివరించటం అభ్యుదయ కవితాలక్షణం *"The struggle for bread is the struggle for socialism"* అన్న లెనిన్ వాక్యానికిది వ్యాఖ్యానప్రాయం వర్షః అంటే సంవత్సరం, వయస్సు వృద్ధాప్యంలో వున్న బిచ్చగత్తె కాబట్టి"భిక్షువర్షీయసి" కుక్క, తొండ, ఎంగిలాకు -పెట్టుబడిదారీ విధానంలో అమానుషత్వాన్ని సూచించే సంకేతాలు ఎక్కువగా త్ర్యస్రగతిలో (మూడు మాత్రల గణాలతో) నడిచిన గేయం ఇది భిక్షుకవృత్తికి ధనస్వామ్య వ్యవస్థ కారణమని బోధిస్తుందీకవిత.

## సంధ్యాసమస్యలు

వెలుతురు వెళ్తూ చీకటి వచ్చే వేళ సంధ్య సాయంసంధ్య రెండు భిన్నమైన పరిస్థితులకు మధ్యగలది సంధికాలం. అదీకాదు-ఇదీకాదు. అంటే సందేహజీవులు. వాళ్ళు సమస్యను సృష్టించుకుంటారు అసలైన తీవ్ర సమస్యని ఎవరూ పట్టించుకోరు. దానిని పట్టించుకొనేవాడే అభ్యుదయ రచయిత

రాక్సీ - మద్రాసులో గల సినిమాహాలు. ఇంగ్లీషుసినిమాలు ఎక్కువగా ఆడేవి.

నార్మాషేరర్ - ప్రపంచ ప్రఖ్యాతి చెందిన హాలీవుడ్ నటీమణి. అమెరికన్ సినిమాతార, అప్పటి వారి 'డ్రీమ్‌గరల్'

బ్రాడ్వే - మద్రాసులో సినిమాహాలు పేరు. ఆ రోడ్డు పేరు కూడా బ్రాడ్వే. తెలుగు సినిమాలూ ఆడేవి

కాంచనమాల - ఒకనాటి అందాల తెలుగు తార (హీరోయిన్) అప్పట్లో తెలుగు వారి 'వరూధిని.'

ఉడిపిశ్రీకృష్ణ విలాస్ - మద్రాసు మౌంట్ రోడ్‌లో ప్రసిద్ధమైన హోటల్. ప్రభుత్వోద్యోగులు తరచుగా ఇక్కడికే వచ్చేవారు.

## ఒకరాత్రి

శ్రీశ్రీమానసిక స్థితిని వివరించే ఆత్మాశ్రయ కవిత ఇది. నిరుద్యోగం, పేదరికం, ఏకాకితనం-వీటిని వ్యక్తీకరించాడు.

బహుళపంచమి - పౌర్ణమి వెళ్ళిన అయిదో రోజు చంద్రుడు క్షీణిస్తూ వుంటాడు

కడుపు దహించుకుపోయే- వేశ్యావృత్తిలోని దైన్యాన్నీ, వేదననూ వివరిస్తున్నాడు

ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం- దుర్మార్గానికి దోపిడీకి గురి అయిన రహస్యం దాన్ని ఉరితీశారు(చంపేశారు)

సినీవాలి - అమావాస్యనాటి చంద్రరేఖ (రవ్వంత వివేకంగల అజ్ఞానంగా )

ఘూకం - గుడ్లగూబ

భేకం - కప్ప

రస విస్మృమర కుసుమపరాగం - విస్మృమర అంటే ప్రసరించుట తన కవిత రసాత్మకంగా ఉండాలనటం

హల్లీసకం - వలయాకారంలో చేసే నృత్యం

కులాయం - గూడు

రోచి - కాంతి కిరణాలు

నివహం - సమూహం

పరిణాహం - వెడల్పు, వైశాల్యం

వితర్ది - వేదిక

ఆవర్తాలు - సుడులు

ధ్వానం - ధ్వని

ఈ ఖండికలో శ్రీశ్రీ నిఘంటు సంస్కరణనీ, వ్యాకరణ సంస్కరణనీ, ఛందో సంస్కరణనీ ఆశించాడనీ, ఇంద్రియ సాక్షాత్కార చిత్రణ వుందనీ, వాక్యలయ, నవ్యపదబంధ రచనతో కవిత్వ దర్శనం చేశాడనీ అంటారు.

## ప్రతిజ్ఞ

ఈ ఖండిక అభ్యుదయ కవిత్వానికి మానిఫెస్టో వంటిది తెలుగు కవిత్వాన్ని వాస్తవికతవైపు పయనింపజేశాడు అనడానికి ఈ ఖండిక నిదర్శనం.

ఇలాతలం - భూమి.

ఘర్మజలం - చెమట

ధర్మజలం - న్యాయంగా శ్రమించటం

వరాల - వరహాలు (నాణెం)

వనిలో - అడవిలో

పరిక్లమిస్తూ - అలసిపోతూ

పరిప్లవిస్తూ - నిమగ్నమవుతూ

విలాపం - దుఃఖం

షరాబు - బంగారం మొదలైన వస్తువులకు నిక్కచ్చిగా బాగా విలువకట్టే వ్యాపారి

జని - జన్మ

నిష్ఠురమై - నిందతో కూడుకొన్నదై (అమంగళమై)

సమర్చనంగా - మంచిపూజగా(సేవించటం)

స్వస్తివాక్యములు - వేదంలోని మంగళవాక్యాలు

సంధానిస్తూ - కూరుస్తూ

సంరావిస్తూ - మోగిస్తూ

చవులు - రుచులు

విరుతించే - ధ్వనించే

ప్రణవం - ఓంకారం (సృష్టికిమూలం)

## భిక్షువర్షీయసి

శ్రీశ్రీ చెప్పిన వ్యధార్త జీవిత యధార్థ దృశ్యానికి ఈ ఖండిక నిలువుటద్దం జీవన వాస్తవికతను వివరించటం అభ్యుదయ కవితాలక్షణం *"The struggle for bread is the struggle for socialism"* అన్న లెనిన్ వాక్యానికిది వ్యాఖ్యానప్రాయం వర్షః అంటే సంవత్సరం, వయస్సు వృద్ధాప్యంలో వున్న బిచ్చగత్తె కాబట్టి"భిక్షువర్షీయసి" కుక్క, తొండ, ఎంగిలాకు -పెట్టుబడిదారీ విధానంలో అమానుషత్వాన్ని సూచించే సంకేతాలు ఎక్కువగా త్ర్యస్రగతిలో (మూడు మాత్రల గణాలతో) నడిచిన గేయం ఇది భిక్షుకవృత్తికి ధనస్వామ్య వ్యవస్థ కారణమని బోధిస్తుందీకవిత.

## సంధ్యాసమస్యలు

వెలుతురు వెళ్తూ చీకటి వచ్చే వేళ సంధ్య సాయంసంధ్య రెండు భిన్నమైన పరిస్థితులకు మధ్యగలది సంధికాలం. అదీకాదు-ఇదీకాదు. అంటే సందేహజీవులు. వాళ్ళు సమస్యను సృష్టించుకుంటారు. అసలైన తీవ్ర సమస్యని ఎవరూ పట్టించుకోరు. దానిని పట్టించుకొనేవాడే అభ్యుదయ రచయిత.

రాక్సీ - మద్రాసులో గల సినిమాహాలు ఇంగ్లీషుసినిమాలు ఎక్కువగా ఆడేవి.

నార్మాషేరర్ - ప్రప్రంచ ప్రఖ్యాతి చెందిన హాలీవుడ్ నటీమణి అమెరికన్ సినిమాతార, అప్పటి వారి 'డ్రీమ్‌గరల్'

బ్రాడ్వే - మద్రాసులో సినిమాహాలు పేరు. ఆ రోడ్డు పేరు కూడా బ్రాడ్వే తెలుగు సినిమాలూ ఆడేవి

కాంచనమాల - ఒకనాటి అందాల తెలుగు తార (హీరోయిన్) అప్పట్లో తెలుగు వారి 'వరూధిని '

ఉడిపిశ్రీకృష్ణ విలాస్ - మద్రాసు మౌంట్ రోడ్‌లో ప్రసిద్ధమైన హోటల్. ప్రభుత్వోద్యోగులు తరచుగా ఇక్కడికే వచ్చేవారు.

## ఒకరాత్రి

శ్రీశ్రీమానసిక స్థితిని వివరించే ఆత్మాశ్రయ కవిత ఇది. నిరుద్యోగం, పేదరికం, ఏకాకితనం-వీటిని వ్యక్తీకరించాడు

బహుళపంచమి - పౌర్ణమి వెళ్ళిన అయిదో రోజు చంద్రుడు క్షీణిస్తూ వుంటాడు

జ్యోత్స్న - వెన్నెల

ఆకాశపుటెడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి - కొత్త అలంకారం వినూత్న పద చిత్రం హృదయం శూన్యం వికలత్వం ఏకాకితనం చైతన్యరహితం

కరి కళేబరం-ఏనుగుశవం

## నీడలు

అధివాస్తవిక పద్ధతి (సర్రియలిజమ్)లో కార్మికుల జీవన క్షోభని చిత్రించిన కవిత ఇది 'నీడ' కార్మికుడికి ప్రతీక వ్యక్తిత్వంలేకపోవటం, పరాశ్రయత్వం నీడ లక్షణం కార్మికులు నీడవంటివారు

వగ - సంతాపం

వ్రీడలు - సిగ్గులు

## శైశవగీతి

శిశువుపై జాషువా పద్యాలలో రాశాడు. శ్రీశ్రీ వచన కవిత్వంలా భాసించే గేయ రీతిలో రాశాడు తన బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ శిశువుపై వాత్సల్యాన్ని ప్రదర్శిస్తూ వారి ఔన్నత్యాన్ని తెలిపాడు

కచభారం - కేశభారం

విభా - వెలుగు

మంత్రకవాటం - రహస్యమైన ద్వారం

కౌముది - వెన్నెల

హిమానీ - మంచు

ఇనబింబం - సూర్యబింబం

కమాచి - కమాస్ అనే హిందూస్థానీ ఛాయలున్న రాగం. అనురాగ చిహ్నం

వైతరణీ నది - నరకంలోని నిప్పుల ఏరు.

## గంటలు

అమెరికన్ కవి, విమర్శకుడు, కథకుడు అయిన ఎడ్గార్ ఎలాన్ పో *(E A Poe)* రాసిన *"The Bell"*కి అనువాదం కాదు అని శ్రీశ్రీ అన్నాడు. కానీ కొందరు అనుసరణ అంటారు కవితావేశానికి గంటలు ప్రతీక.

అగడ్త - కోటచుట్టూ రక్షణకై తవ్వబడిన జలాధారం (రక్షణకోసం)

సివంగి - ఒక మృగం

కురంగి - లేడి

సృగాలం - నక్క

బిడాలం - పిలి

## దేశ చరిత్రలు

'మార్క్సిజం' స్థూలమైన స్ఫూర్తితో చరిత్రను వ్యాఖ్యానించిన కవిత ఇది భౌతికవాద దృక్పథంతో చరిత్రను పరిశీలించాడు శ్రీశ్రీ *"Applied History"* అంటే ఏమిటో తెలియ జెప్తుందీ కవిత సామాన్యుని పాత్రను విస్మరించే చరిత్రను చరిత్రే కాదన్నాడు ఇందులో వర్గసంఘర్షణ వుంది

ఆహరణ - అపహరించు

ఉద్యోగం - ప్రయత్నం

సిక్తం - కూడుకొన్నది

సమవాకారం - నాటకభేదం

చెంఘిజ్ ఖాన్ - మంగోల్ జాతీయుడు హంతకుడు

తామర్లేన్ - తైమూరుగా ప్రసిద్ధుడు అధికార దాహంతో శత్రువుల కపాలాలను దండలుగా, తోరణాలుగా చేశాడు.

నాదిర్షా - ఇరాన్ దేశస్థుడు పర్షియా రాజును చంపి సింహాసనం ఎక్కాడు. భారత దేశాన్ని ముట్టడించాడు

గజనీ - 17సార్లు మన దేశంపై దండెత్తాడు. రాజ్యవిస్తరణ కాంక్షాపరుడు దోపిడీ దారుడు

ఘోరీ - ముస్లిం సామ్రాజాన్ని సుస్థిరం చెయ్యడానికి మన దేశంపై దండయాత్రలు చేశాడు

సికిందర్ - అలెగ్జాండర్ గ్రీకుల దండయాత్రకి నాయకత్వం వహించాడు. పురుషోత్తముడు ఇతడ్ని ఎదిరించాడు అరిస్టాటిల్ శిష్యుడు

వైకింగులు - స్కాండినేవియన్ జాతి దోపిడీ మూకలు.

శ్వేత హూణులు - మధ్య ఆసియాకు చెందినవారు. 5వశతాబ్దిలో గుంపులుగా తిరిగిన యుద్ధోన్మాదులు

శిథియన్లు - క్రీ పూ ఆశ్విక బలంతో యుద్ధాలు, హింసలు చేసిన కొండజాతి

పారశీకులు - పర్షియా రాజ్య స్థాపకులు దేశాలమీద పడి దోచుకునేవారు.

పిండారులు - ఆఫ్గన్ జాతీయులు. రాజపుత్ర రాజ్యాలనూ నిజాం రాజ్యాన్నీ దోచుకొన్నారు దోపిడీ దొంగలు

థగ్గులు - 13వ శతాబ్దిలో ఇండియాలో దోపిడీలు, హత్యలు సాగించిన మతోన్మాద జాతి. 20లక్షల మందిని గొంతు నులిమి హత్యచేశారట!

హాటెన్ టాట్ - దక్షిణాఫ్రికా సంచారజాతి

జూలూ - దక్షిణాఫ్రికాలో పశువుల్ని కాస్తూ బతికేజాతి.

నైలునదీ నాగరికత - ఈజిప్టులో గల నైలునది అతిపెద్దది. ప్రపంచ నాగరికతలో ప్రాచీనమైనది ఈనదీ తీరంలో ఆవిర్భవించింది.

తాజ్‌మహల్ - షాజహాన్ తన భార్య ముంతాజ్ బేగం మరణించినప్పుడు ఆమె జ్ఞాపకార్ధం కట్టించాడు ఆగ్రాలో యమునా నది ఒడ్డున వుంది ప్రపంచ వింతలలో ఏడవది. 11సంవత్సరాలలో 9కోట్ల 17లక్షల రూపాయలతో వేలాది కార్మికులతో తాజ్‌మహల్ నిర్మించబడింది.

తక్షశిల - ప్రాచీన కాలంలో ప్రసిద్ధమైన భారతీయ విశ్వవిద్యాలయం

పాటలీపుత్రం - ప్రాచీనకాలంలో పేరున్న నగరం నేటి పాట్నా హరప్పా, మొహంజొదారో - సింధునదీ తీరాన గల అతి ప్రాచీన నాగరికత ప్రస్తుతం పాకిస్తాన్‌లో వుంది

క్రోమాన్యాన్ - ఫ్రాన్స్‌లో ఒక గుహ ఇందులో అతి ప్రాచీన మానవుని అవశేషాలు దొరికాయి

## మానవుడా!

ఇందులోని మానవుడు విశ్వమానవుడు *(universal man)* మానవుడి పుట్టుకను గురించి, మానవ స్వభావాలు గురించి, మానవుడిలో గల వివిధ భేదాలు గురించి శ్రీశ్రీ లోచూపుతో లోక పరిశీలనతో వివరించిన కవిత ఇది

కల్పాంతం - ప్రళయం

పరమాణువు - Atom పదార్థం లేని కనిష్ఠాంశం సైన్స్ ప్రకారం పరమాణువు నుంచే మానవుడు జన్మించాడు.

విహ్వాలుడు - భయం చేత స్వాధీనం తప్పినవాడు

ధని - ధనం గలవాడు

పిపాస - దాహం

ధూమశకటం - రైలు

ధుని - నది

పరీవృతుడు - చుట్టబడినవాడు

మాలీ - మాలాకారుడు, తోటమాలి.

## గర్జించు రష్యా

రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా జర్మనీపై యుద్ధం చేసి ఫాసిజాన్ని నిరసించింది జర్మనీది దౌర్జన్యం. హిట్లర్ స్వాతంత్ర్య శత్రువుగా అభివర్ణించాడు. రష్యావల్ల సామ్యవాద స్వర్గం ఏర్పడుతుందని శ్రీశ్రీ అప్పటి ఆశ.

పుష్కిన్ - అలెగ్జాండర్ పుష్కిన్ మహాకవి, కధకుడు

గొగోల్ - రష్యన్ రచయిత, కధకుడు, నవలా రచయిత

షెకోవ్ - వైద్యుడైన గొప్ప కధకుడు.

టాల్‌స్టాయ్ - కధకుడు, నవలా రచయిత. శ్రీశ్రీపై ప్రభావం చూపాడు ఇతని 'అన్నాకెరీనా' నవల చాలా ప్రసిద్ధమైంది

దస్టోయ్ వస్కీ - రష్యన్ నవలా రచయిత "క్రైమ్ అండ్ పనిష్మెంట్" నవలా రచయిత

గోర్కీ - మాక్జిమ్ గోర్కీ రష్యన్ రచయిత, కధకుడు ఇతని 'అమ్మ' నవల ప్రపంచ ప్రసిద్ధి చెందింది

కుప్రిన్ - గొప్ప రష్యన్ నవలా రచయిత ఇతని "యమాదిపిట్" ప్రసిద్ధ నవల

మార్క్స్ - కారల్‌మార్క్స్, కమ్యూనిస్ట్ తత్త్వవేత్త. 'దాస్‌కాపిటల్' గ్రంధకర్త. కొత్త ఆర్థిక సిద్ధాంతాన్ని అందించాడు

ఎంగెల్స్ - మార్క్స్ సహచరుడు కమ్యూనిస్ట్ తత్త్వవేత్త

లెనిన్ - రష్యన్ కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు. రష్యాలో సామ్యవాద స్థాపనకి పూనుకున్నాడు సిద్ధాంత ప్రవక్త ఎన్నో గ్రంధాలు రాశాడు విప్లవనాయకుడు.

స్టాలిన్ - లెనిన్ తర్వాత రష్యా కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు కమ్యూనిస్టులకు ఆరాధ్యుడు వ్యక్తి ఆరాధనను నిరసించే కొందరు నియంత అంటారు.

## జగన్నాధుని రథచక్రాలు

*జగన్నాధుని రథం సామ్యవాదరథం. పూరీ క్షేత్రంలో జగన్నాధస్వామి ఉన్నాడు. అక్కడ జగన్నాధుని రథోత్సవం బ్రహ్మాండంగా సాగుతుంది ఈ ఖండికలో సామ్యవాద ప్రపంచంపై ఆశవుంది సామాన్యుల దుస్థితినీ, సామ్రాజ్యవాదుల దౌర్జన్యాన్నీ వెల్లడించాడు.*

కధావశిష్టులు - ముగింపులేని కథ గలవారు

వ్యధానివిష్టులు - వ్యధలలో ఉంచబడేవారు

పరిచ్యుతులు - వదిలివేయబడినవారు

జితాసువులు - జయించిన ప్రాణం గలవారు

చ్యుతాశయులు - వదిలిన ఆశ గలవారు

హృతాశ్రయులు - దొంగిలింపబడ్డ ఆశ్రయం కలవారు

హిమాచలం - ధనస్వామికి సంకేతం

వింధ్యాచలం - గర్వాతిశయానికి సూచన

ధూర్జటి - శివుడు

టార్పిడో - ఓడని ధ్వంసం చేసే యుద్ధ నౌక

టోర్నాడో - మహా వాయుగుండం వంటి ఉత్పాతం

సవనం - యజ్ఞం

## అంకితం

శ్రీశ్రీ తన అభ్యుదయ కావ్యం "మహాప్రస్థానాన్ని కొంపెల్ల జనార్దనరావుకి అంకితమిచ్చాడు. శ్రీశ్రీకి జనార్ధనరావు ఆప్తమిత్రుడు. జనార్ధనరావు బాగా చదువుకొన్నాడు కవి, విమర్శకుడు 'ఉదయిని' పత్రికని నడిపి బాధలు పడ్డాడు

క్షయవ్యాధి వల్ల ఆకస్మిక మరణం చెందాడు  అప్పుడు శ్రీశ్రీ బాధతో రాసినదే "కొంపెల్ల జనార్దనరావు కోసం" అనే కవిత  ఇది ఎలిజీ  అంటే స్మృతి కవిత

## మార్క్సిజమ్

అభ్యుదయ కవిత్వానికి ప్రాణం 'మార్క్సిజమ్' "బాహ్యప్రకృతిలో జరుగు మార్పులే సామాజిక పరివర్తనకు మూలహేతువులు  భౌతికశక్తుల ప్రభావం మన ఆలోచనలపై ప్రసరిస్తుంది  ప్రపంచం పదార్థ నిర్మితం  ఆత్మయన్నది లేదు  స్వభావతః పదార్థం గతిశీలమైనది  దానిని నడిపించేవి ప్రకృతి శక్తులే కాని దైవిక శక్తులు కావు" అని మార్క్సిజం స్వరూపాన్ని ఆచార్య సి.నారాయణ రెడ్డి వివరించారు  మార్క్సిజంలో గతితార్కిక భౌతికవాదం (Dialectical Materialism) ముఖ్యం  దీనికి మూడు సూత్రాలున్నాయి

1. పరస్పర విరుద్ధ శక్తుల మధ్య సంఘర్షణ  అంటే వర్గకలహ సిద్ధాంతం (Class Struggle Theory)
2. విరోధ వైరుధ్యం (negation of negation)
3. పరిమాణం గుణంగా మారే పద్ధతి.

